ఆంధ్రసచిత్రవార

# పత్రిక

ఎదిగే పిల్లల సమస్య



4-12-64

30 పైసలు

నేతలో, మన్నికలో పనితనంలో

# కొఠారీ మల్లులు

విశిష్టమైనవి లాంగ్‌క్లాత్‌లు కూడా!

... ఎందుకంటే

• కొఠారీ మల్లులు మరియు లాంగ్‌క్లాత్ బట్టల తయారీలో ఉపయోగింపబడిన నూలు ఉత్తమ రకపు కొఠారీ నూలు.

• వాటంతటవే తిరిగే ఆటోమాటిక్ లూములమీద నేసిన బట్ట నేత బాగా ఉంటుంది.

ఎప్పుడూ కొఠారీ మల్లు M-7 మరియు అదే పేరుతో లాంగ్‌క్లాత్ L-1 లేక L-2 అడగండి.

ఈ ట్రేడ్ మార్కుని గమనించండి



తయారు చేసినవారు:
కొఠారీ టెక్స్టైల్స్ లిమిటెడ్
పింగవల్లూరు, కోయంబత్తూరు.
భారతీయ మానక్ సంస్థ వర్తింపబడిన సెంటర్లు.
మేనేజింగ్ ఏజెంట్లు:
కొఠారీ & సన్స్, ...






ఎన్నో రకముల యింట్లో వాడుకొనే

# క్లియర్‌టోన్ ఉపకరణములు

Kleertone


రేడియంట్ హాట్ ప్లేట్


ఇంపీరియల్ ఇస్త్రీపెట్టె


ఇంట్లో వాడుకొనే ఇస్త్రీపెట్టె


కెటిల్


టోస్టర్


టేబుల్ మరియు సీలింగ్ పంకాలు



ఎలెక్ట్రిక్ గడియారం


మడతపడే స్టీల్ ఫర్నిచరు

*క్లియర్‌టోన్ డీలర్లవద్ద మరియు నేషనల్-ఎక్కో డీలర్లవద్ద లభిస్తున్నాయి. ఇంకా యీ క్రింది ఎడ్రసువద్దకూడ లభిస్తున్నాయి:*

జెనరల్ రేడియో & అప్లయన్సెస్ లిమిటెడ్

బొంబాయి . కలకత్తా . మద్రాసు . ఢిల్లీ . బెంగుళూరు . సికిందరాబాదు . పాట్నా

GRA

JWTGRA-2804 (A)

# జెన్సన్ & నికల్సన్

# రోబియాలాక్ పెయింట్లు

## లోపలి, వెలుపలి పూతలకు అందరూ సహజంగా 'ఎన్నుకొనేవి.



దీనికి కారణాలేమంటారా...

### రోబియాలాక్ ప్లాస్టిక్ ఎమల్షన్

1. కన్నులు జిగేలు గొలిపే 120 రంగులలో లభ్యం కాగలదు.
2. ఒక గంటలోనే ఆరిపోతుంది.
3. కుంచె గుర్తు లేకుండా ధారాళంగా ప్రాకిపోతుంది.
4. ఎన్నిసార్లు కడిగినా, తుడిచినా రంగు తగ్గదు.

### రోబియాలాక్ సూపర్ - గ్లాస్ సింథెటిక్ ఎనామెల్

1. రంగు కరగదు, కాంతులీనే మెరుగు కలిగివుండి అనేక వర్ణాలలో లభ్యం కాగలదు.
2. పూతపూసిన తర్వాత మెరుస్తూ అందంగా వుంటుంది.
3. ఎలాంటి ఉపరితలానికైనా పూర్తి రక్షణ నిస్తుంది.
4. త్వరగా ఆరుతుంది. పూత పూయడం అతి తేలిక.




జె & యన్ కోటింగ్స్‌ను అమ్మేది నాణ్యతే




వర్ణాల పూర్తి వివరాలకు, ఇతర వివరాలకు మీ సమీపంలోగల జె & యన్ డీలర్‌ను కలుసుకోండి.

# ఉత్తరాలు

## పిల్లల సంచిక

"బాల బాలికల ప్రత్యేక సంచిక (20—11—64) ముఖచిత్రం నాకు బాగా నచ్చింది. ప్రస్తుత దేశకాల పరిస్థితులను తన కళ్ళారాచూస్తూ (శ్రీ నెహ్రూ) బాధపడుతున్నారని పించింది. ఆయనను చూడగానే మాకు కళ్ళల్లో నీరు గిర్రున తిరిగింది. ఆ మహాత్ముడు చిరస్మరణీయుడు. మన తరంలో ఆయన మళ్ళీ ఉదయించడు. ఆ అవతారమూర్తి మళ్ళా దేశంలో న్యాయము, ధర్మము, శాంతి, భద్రత లుదయించినప్పుడే ఉదయిస్తాడు.

మధ్య పేజీలో (రోజాజీ) చిత్రం బ్రహ్మాండంగా ఉంది. చిత్ర రచయిత ఆర్. సిద్ధిరాంకు మా కృతజ్ఞతలు.

గోరంట్ల అనంత పద్మనాభయ్య (ఉరవకొండ)

* * *

"బాల బాలికల ప్రత్యేక సంచిక (20—11—1964)" లో చిత్రకారులు శ్రీ ఆర్. సిద్ధిరాంగారు చిత్రించిన చిత్రం 'జవహర్‌లాల్ నెహ్రూకీ జై'.

రక్తరేఖ (సికింటరాబాదు)

* * *

20—11—1964 సంచికలో వేసిన వీరాజీ అన్నయ్య ఉత్తరం చాల బాగుంది. వీరాజీ అన్నయ్యకు మా అభినందనలు. కలువకొలనుగారి పిల్లల సీరియల్ "బంగారు నడచిన బాట" మాకు అందరికి ఎంతో బాగా ఉంది. చాల రోజులనుంచి మేము ఎదురుచూస్తున్న మా కోరిక ఇపుడు నెరవేరినది. "లేడిపిల్ల తెలివి" అన్న కథ కూడా బాగా ఉంది. రచయితలకు మా అభివందనలు తెలుపవలసినది. మధ్య పేజీలో ప్రచురించిన చాచా నెహ్రూ చిత్రం చూడ ముచ్చటగా ఉంది.

మోహన్, విజయ, శారద, శ్రీనివాస్, ప్రసాద్, పద్మ అండ్ బాబు (సికింద్రాబాద్)

* * *

బాల బాలికలతో స్వర్గీయ నెహ్రూగారి బొమ్మ ఆంధ్ర పత్రిక వారపత్రికకు ఎంతో ఆకర్షణీయంగా ఉంది. "మళ్ళీ అలాంటి బాలుడు ఎప్పుడు ఎక్కడ ఉదయిస్తాడు?" చాలా చక్కగా ఉన్నది. బాల బాలికలలో ధైర్యము, పట్టుదల, ఆశక్తి, ఆలోచనాశక్తి పెంపొందేటట్టు వ్రాశారు.

రాధిక (నెల్లూరు)

## సినిమా

"దోస్తీ" చిత్ర సమీక్షను గురించి వివరిస్తూ ఈ చిత్ర సంగీత దర్శకులు "లక్ష్మీకాంత్ ప్యారేలాల్" కి బదులుగా "కృష్ణకాంత్ ప్యారేలాల్"గా వేశారు. ఇది అచ్చు పొరపాటా?

టి. వి. రాధాకృష్ణ, సికింద్రాబాదు.

కాదు సమీక్షకుని పొరపాటు.

## కథలు, సీరియల్ కథలు

"మీరూ 20—11—64 ఆంధ్ర పత్రిక వారపత్రికలో శ్రీ చాంద్‌గారు వ్రాసిన 'ఆశ్రయం' అనే కథ చాలా సహజంగా, బాధాపూరితంగా ఉంది. కథను పూర్తిగా చదివిన తర్వాత శివయ్య పరిస్థితికి హృదయం చలించి కన్నీటి బొట్లు కార్చలేకుండా ఉన్నానంటే నమ్మండి.

ఈ వారంలో సీరియల్స్ "హృదయ కుసుమాలు", "ఐదుగురెళ్ళు" బాగా రక్తికట్టాయి. ఈవారంలో సరిక్రొత్తగా మీరు ప్రచురించిన శ్రీరామలింగంగారి "దొంగ కథలు" చాల తమాషాగా, యుక్తియుక్తంగా నున్నాయి. తర్వాత మధ్యపేజీలో ముద్రించిన శ్రీ సిద్ధిరాం గారి "పండిట్ జవహర్లాల్‌జీ" చిత్ర రచన చాలా సహజంగా, హృదయాలను చలించేదిగా ఉంది. స్వర్గీయ మన జవహర్‌లాల్‌పై శ్రీ వీరాజీ అన్నయ్య వ్రాసిన వ్యాసం చదువుతూంటే కళ్లలో, గిర్రున నీళ్లు తిరిగాయి. "ఈనాడు బాలల దినోత్సవంనాడు మన జవహర్లాల్‌జీ మనమధ్య లేడు" అని వీరాజీ అన్నయ్య వర్ణించిన మాట మిక్కిలి బాధాపూరితమై, ఏడుపొచ్చేంత పనైంది.

వే. ప్రభాకరమూర్తి (తిరుపతి)

* * *

"ఐదురెళ్ళు" సీరియల్ కథలోని అక్కచెల్లెళ్ళులాగే చురుకుగా సాగుతోంది. కథ పేరుకు తగినట్లుగా చేతి ఐదు వ్రేళ్ళను వాని పేరును చిత్రించిన చిత్రకారుడు అభినందనీయుడు.

జి. కృష్ణవేణి (విజయనగరం)

## ఆటంబాంబ్

"మనలో మాట"లో మీరు ప్రచురించిన ఆటంబాంబ్ వివరములు చూడగా నాకీ యూహ కలిగినది. బ్రహ్మాండమున అంగారక—బృహస్పతుల నడుమ చిన్న గ్రహముల సమూహమున్నదనియు, ఒకప్పుడది యొకే గ్రహమనియు, కాలప్రభావముననో, గురుత్వాకర్షణకు లోనయ్యో లేక గ్రహమునందే కల్గిన మిక్కిలి యొత్తిడికో చిన్నాభిన్నములై ఆ భిన్నముల నడుమ ఆకర్షణకల్గి గోళములవంటి చిన్న గ్రహము లైనవని శాస్త్రజ్ఞుల యూహ. గ్రహమున మిగుల యొత్తిడి కలుగ కారణమేమి? క్రింది విషయము నిజము కాకపోవచ్చుగాక! మన యూహలో.

అది యొక గ్రహమై, అచటి ప్రజలు మిగుల నాగరకులై, అణుశక్తి, ఉదజనిశక్తి వివరములు మనకన్న ఎక్కువగ తెలిసికొనియుండి, ఇప్పటి మానవులవలె శాంతికొరకు యోచింపక, క్షుద్రావేశముతో, మిగుల ప్రభావముగల బాంబును పేల్చియున్నచో, దాని ప్రేలుడు శక్తికి శబ్దమునకు గ్రహ కేంద్రమున చీలికలుపడి గ్రహ విచ్ఛిత్తి యైనదేమో! ఇట్లు జరిగియున్నచో 30,000 మెగాటన్నుల బాంబు పేల్చిన దాదాపు జీవజాలమంతయు నాశనమగునట్టి ఎడ 320,000 మెగాటన్నుల బాంబు ప్రయోగముతో భూగ్రహము కూడ చిన్నాభిన్నమై సూర్య కుటుంబమున క్రొత్త లెక్కలు గట్టవలసి వచ్చునా? వేదకాలమునుండి లేదా వోల్డ్ టెస్టామెంట్ కాలమునుండి నేటివరకుగల మానవ విజ్ఞానమున ఇతర గ్రహములలో ప్రవేశపెట్టుటకై జరుపు మానవుని రోదసీ విజయములు వమ్ము కావలసినదేనా? ఈ బాంబువలన మానవ విజ్ఞానము ఇతర గ్రహములకు చేరకపోవుటేగాక, వారి విజ్ఞానములో భూమియొక్క స్థానము భ్రంశము పొందు నవకాశములును గలవని తలంపవచ్చును. ఇదేనా ఆటంబాంబు ప్రయోజనము?

ఒక గ్రహపు గురుత్వాకర్షణ శక్తిలో మార్పు వచ్చినచో ఇతర గ్రహచలనములలో ఘర్షణము కలుగునుగదా! మన వైషమ్యములచే మానవులకే గాక, ఇతర గ్రహవాసులకు గూడ కష్ట నష్టములు గల్గించుట భావ్యమా? భూమిపైగల చిత్ర విచిత్రములగాంచి, దీనిని సృష్టించిన పరబ్రహ్మను మెచ్చని మానవుడు గలడా? అట్టి పరబ్రహ్మ స్వరూపమేయగు బ్రహ్మాండమును బద్దలు గొట్టుట క్షుద్ర మానవుని యాశయమా? ఇదే జరిగిన మానవుని యహంకారముచే కలుగు తీవ్ర పరిణామములఁజూచి చింతించుటకు చీమ గూడ మిగులదేమో.

కావున ఆటంబాంబ్ ప్రయోగములమాని ఈ విజ్ఞానమును, శక్తిని ఇతర గ్రహవాసులతో స్నేహ సౌహార్ద్రముల గల్పించుకొనుటకు భూమిపైనుండు జీవజాలమంతటిని సుఖతృప్తులుగ జేయుటకు వినియోగించిన మేలని అణు శాస్త్రజ్ఞులకు, వారిని ప్రోత్సహించు ప్రభుత్వములకు, ప్రజలకు నా ప్రార్థనా పూర్వక సందేశం.

సత్యవతమ్మ (చిత్తూరు)

* * *

కత్తులతో చేసుకునే యుద్ధమైతే అవతలి వాడిదగ్గర కత్తి ఉంది. మన దగ్గరలేదు! అని ఆలోచించటంలో అర్థం ఉంది. మన ఆటంబాంబుతో చైనాకి ప్రమాదం తెచ్చి పెట్టగలం గాని, చైనాయే మనకి ప్రమాదం తెచ్చిపెట్ట దలిస్తే ఆపలేముకదా.

మన అణుశక్తి ప్రత్యేకం బెదరింపుకే అయితే అందుకువిలిన విధానం తగినట్లుంది. ఇతర దేశాలతో యుద్ధ విషయకమైన ఒడంబడికలు చేసుకోవటం ఉత్తమం. అలిన విధానం పాటిస్తూ—మన శక్తితో మనం బాంబులు తయారు చేసిననాడు మన ఆర్థిక వ్యవస్థ, ప్రజల జీవన వ్యవస్థ(చైనాలోలాగా) దెబ్బ తినకమానదు.

రాయసం పార్థసారథి (వాల్తేరు)

* * *

చైనకు భారతదేశం అణ్వస్త్రోద్యమైనదని తెలియాలి. యుద్ధం వస్తుందనికాదు. అణు సామగ్రి శాంతి సాధనలకు వినియోగించవచ్చును. విదేశీయ అణ్వస్త్ర ఛత్రం క్రింద మనుట పాడిగాదు భారతావనికి. ఇది తయారు చేయుటానికి, అణ్వస్త్ర సముపార్జనకు ఖర్చు అగుననుట తథ్యం. భారతదేశానికి రష్యా, అమెరికాలవలె అణ్వస్త్ర తయారీల పాటి అనవసరం. శాంతి కావాలంటే యుద్ధానికి సిద్ధం కావాలని సూక్తి.

కనుక భారతదేశానికి అణ్వాయుధాలు, ప్రోత్సాహ ప్రపంచ పక్కీ కనుగుణంగా అవసరం.

డి. ప్రసూన (అనంతపురం)★

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 4--12--'64
క్రోధినామ సం॥ కార్తీకమాస బ॥ అమావాస్య
సంపుటము 57 సంచిక : 14
స్థాపితము :
1908
*
ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్
*
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
*
ఒక సంవత్సరం
చందా వివరాలు

ఇండియా రూ. 15.60. ఇతర దేశాలు ఓడమీద (Sea Mail) రూ. 28.60. విమానం ద్వారా (Air Mail) బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు రూ. 120.00. అమెరికా రూ. 176.80. ఆస్ట్రేలియా రూ. 148.20.

విడిప్రతి 30 పై.
సంవత్సర చందా 15.60 పై.
6 మాసాల చందా 7.80 పై.
*
ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1




"లంచాలంటె అసలు నాకు కిట్టదు కావాలంటే ఆ 'సిటీ ఫవుంటన్' తీసేసి నా విగ్రహాన్ని అక్కడ పెడితే నేనేమీ అనుకోను."

## మనలో మాట

గుంటూరులో ముగిసిన అఖిలభారత్ కాంగ్రెస్ సభ(ల) సమీక్ష ఒకటి; బొంబాయిలో జరగనున్న యుకారిస్ట్ కాంగ్రెస్ గురించిన చిన్న వ్యాసం ఒకటి; యీ సంచికలో వేశాము. కాంగ్రెస్ సభల సమీక్ష పోయిన వారమే యివ్వవల్సినది కాని స్థలాభావం చేత పంపించలేక పోయాము!

* * *

వచ్చీరాని వయస్సు పిల్లల పెంపకంలో ఎంత జాగ్రత్త అవసరమో, ఎదిగీ ఎదగని పిల్లలు నడుమలో పెట్టటం కూడా అంత సమస్యే. ఈ విషయాన్ని పర్యావలోకిస్తూ 'విశాఖ'గారు వ్రాసిన వ్యాసం యీ వారం 'వనితాలోకం'లో పడ్డది. పఠితలకు నచ్చుతుందనుకుంటున్నాము.

* * *

శ్రీ డేవిడ్ ఎట్రిక్ వ్రాస్తున్న "చికిత్సాం అవధులు" శీర్షికలో రెండో వ్యాసం యీ వారం వేశాము. పాఠకులకు వీటిపై రాగల సందేహాలను శ్రీ డేవిడ్ ఎట్రిక్‌కు పంపగలగడం, సమాధానాలు తెప్పించగలడం సాధ్యం కాని పని అని మనవి చేసుకుంటున్నాము.

* * *

ఇదివరలో 'రామేశ్వరం' మీద సచిత్ర వ్యాసం ఒకటి వేశామని పాఠకులకు జ్ఞాపకం వుండే వుంటుంది. పై వారం శ్రీరంగం గురించి ఒక వ్యాసం వేద్దామనుకుంటున్నాము. ★

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : 'ఏప్రిల్ ఫూల్'లో సైరాబాను

పరిశీలక్

# గుంటూరులో ముగిసిన ఏ. ఐ. సి. సి. సభలు:



సభా వేదికపై కాంగ్రెస్ పెద్దలు: శ్రీయుతులు లాల్‌బహదూర్, నందా, బ్రహ్మానందరెడ్డి, శీలం సిద్ధారెడ్డి, ఎం. ఆర్. అప్పారావులను చూడవచ్చును.

గుంటూరులో జరిగిన ఏ.ఐ.సి.సి. సమావేశాలు గుంటూరు పట్టణం పేరు ప్రతిష్ఠలను పెంచకపోగా, సభా ప్రాంగణంలో నిర్మించిన ప్రకాశం మండపానికి నలువైపులా నిలబెట్టిన ఒంగోలుగిత్తలు కాంగ్రెసు పార్టీ నేటి స్థితిని నిరూపించాయి,

కాంగ్రెసు పార్టీకి ఎన్నికల చిహ్నం కాడికి కట్టిన కోడెద్దులు. ఇది రైతుల గుర్తు అని, కాంగ్రెసు పార్టీ—నిజతత్వానికి చిహ్నమని ఆనాటి కాంగ్రెసు కార్యదర్శి శ్రీ కళా వెంకటరావుగారు చెప్పారు. ఎద్దు ఎలా వ్యవసాయంచేసి, రైతుకు పంటలు పండించి ఇస్తుందో, కాంగ్రెసుపార్టీ కూడా ప్రభుత్వంలో ఉండి ప్రజాశ్రేయస్సుకు కృషిచేస్తుం దన్నారు. ఎద్దులకు కాడి కట్టడం వంటిదే కాంగ్రెసు సభ్యులకు "పార్టీ క్రమశిక్షణ" అని కూడా అన్నారు.

కాని ఈనాటి కాంగ్రెసుపార్టీకి క్రమశిక్షణ లేదు. ఆ పార్టీలోని సభ్యులు వ్యవసాయంచేసే ఎద్దులవంటివారు కాదు. ఇంకా "కాడి కట్టని గిత్తలు" వంటి వారు. అందులోను పోట్లగిత్తలు, కనకనే "పొడవడానికి పెద్దలయ్యే గిత్తలం బొమ్మ లను" నెహ్రూ నగర్ మధ్యగా, ఎత్తయిన ప్రకాశం మండపంపైన నలువైపులా ఉంచారు. నాలుగు రోజులు జరిగిన ఏ. ఐ. సి. సి. సభలను "గిత్తల పందెముల జాతర" గా మార్చారు.

ఈ సభలలో గమనార్హమైన అంశం. నాయకులను చూడడానికి వచ్చిన ప్రజలు. అందులోను అధిక సంఖ్యాకులు గ్రామీణులు. వచ్చిన ప్రతి వంద మందిలోను ఏ ఒకరిద్దరికో సభా ప్రవేశపు అదృష్టం లభించింది. అది కూడా మూరా ఆధి మానం. బ్లాకుమార్కెటులో టిక్కెట్టు పొందగల శక్తి కలవారికే దక్కింది. మిగిలినవారంతా పుర వీధులలో బారులుతీరి నిలబడి చూడగలిగిన నాయకులను చూచి, తమ కుతూహలాన్ని తీర్చుకున్నారు. నాయకుల పట్ల కుతూహలం ఉండడం ఒక ఎత్తు. వారిని, వారి పార్టీని అభిమానించి వోటు చేయడం మరొక ఎత్తు. ఈ వ్యత్యాసాన్ని గుర్తించక, వచ్చినవారంతా కాంగ్రెసు అభిమానులని భావించడం, ఇదంతా కాంగ్రెసు బలం అని అంచనా వేయడం, అలాంటి ఆలోచన చేసేవారి పొరబాటు కాగలదు. కారణం—ఆ కిందటి ఎన్నికలలో శ్రీ నెహ్రూ బహిరంగ సభలకు ఆంధ్రదేశంలో వచ్చినంత జనం ఎక్కడా రాలేదు. అయినా వోట్లు కాంగ్రెసు అభ్యర్థులకు వచ్చినన్ని తక్కువ వోట్లు ఇంకెక్కడా రాలేదు.

జనాకర్షణ గల వ్యక్తి పండిట్ నెహ్రూ. ఆయన లేకుండా జరిగిన రెండవ ఏ. ఐ. సి. సి. సభ గుంటూరు సభ. నెహ్రూ లేకపోయినా లక్షలమంది జనం తమను చూడడానికి రావడంవల్ల, నేటి కాంగ్రెసు అగ్రనాయకులకు ఆత్మవిశ్వాసం పెరిగింది. తాము నెహ్రూవారసులమే భావం కొందరిలో కానవచ్చింది. నెహ్రూ లేకపోయినా దేశ నాయకత్వం వహించగల మనే ధోరణి మరి కొందరిలో వినవచ్చింది. ఇందుకు ఉదాహరణగా శ్రీ ఎస్. కె. పాటిల్, సర్దార్ స్వర్ణసింగ్, శ్రీ సి. సుబ్రహ్మణ్యం, శ్రీ కామరాజ్, శ్రీ బ్రహ్మానందరెడ్డి, శ్రీ అతుల్యఘోష్ ప్రభృతులను ఉదాహరించవచ్చు. వీరందరూ సభావేదికపై అగ్రనాయకుల స్థాయిలో ఆసీనులైన రీతి, సమా



విజయవాడ బహిరంగ సభలో ఒక హాస్యసన్నివేశంలో కూడిన సన్నివేశం.

# ఒక ప్రత్యేక సమీక్ష!

లోచనలు కొనసాగించిన పద్ధతి ఇందుకు నిదర్శనంగా ఉంది.

**అందులోను ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డిగారు సభావేదికపై నాయకులను పరామర్శించిన పద్ధతి, సభాకార్యక్రమాన్ని గురించి సమాలోచనలు కొనసాగించిన రీతి అందరి మన్ననలుపొందింది. ఆయన అగ్రనాయకులకు తలలో నాలుకగా వున్నారా అనిపించడమే కాదు. అగ్రనాయకుల కోవకు చెందగల లక్షణాలు మెండుగా కలవని ఆ మూడురోజుల సభలలోను నిండుగా నిరూపించుకున్నారు శ్రీ బ్రహ్మానందరెడ్డి.**

పూర్వపు రోజుల్లో పండిట్ నెహ్రూ, సర్దార్ పటేల్, మౌలానా అజాద్, రాజేంద్రబాబు, డాక్టర్ పట్టాభి, పండిట్ పంత్, డాక్టర్. బి. సి. రాయ్, రవిశంకర్ శుక్లా, ఖాన్ అబ్దుల్ గఫార్‌ఖాన్ వంటి జాతీయ నాయకులు వేదికపై ఆసీనులై ఉన్నప్పుడు కానవచ్చిన దృశ్యానికీ, ఇప్పుడు మూడవతరం నాయకులతో కనిపించిన దృశ్యానికి చాలా తేడా ఉంది. అనాటి దృశ్యం కన్నుల పండువుగా ఉండేది. జన్మ తరించినట్లు అనిపించేది. ఒకరకమైన ఆవేశం, భక్తిభావం కలిగించేది. కాని నేటి దృశ్యం ఇందుకు విరుద్ధంగా ఉండడమే కాదు. మెదడుకు మేత పెడుతున్నది. రకరకాల ఆలోచనలను రెచ్చగొడుతున్నది.



ఆగ్రశ్రేణి నాయకుల తర్వాత, రెండవ తరంలో మొదటి శ్రేణి నాయకులుగా ఉన్న శ్రీయుతులు మొరార్జీ దేశాయ్, జగజీవనరాం, నిజలింగప్ప, దేబర్ ప్రభృతులు వేదికమీద ఉన్నారు. కాని వీరు వెనుకవైపున ఎందుకు ఉంటున్నారు? అధికార తీర్మానాలకు ప్రతిపాదనకుగాని, వానిపై జరిగే చర్చలలో పాల్గొనడానికిగాని వీరెందుకు ముందుకు రావడంలేదు? వీరు అధిష్ఠానవర్గంలో అంతరంగికులు కారా? వీరిని ఇలా అనామకుల్లుగా ఉంచడం కాంగ్రెసుపార్టీకి శ్రేయస్కరం కాగలదా? ఇలాంటి ఎడమొఖం—పెడమొఖం పరిస్థితి ఇంకెన్నాళ్లు సాగుతుంది? ఎన్నాళ్లు సాగినా, అసలు ఈ స్థితి కాంగ్రెసుపార్టీకిగాని, దేశానికిగాని, మంచిదికాదని, గుంటూరు ఏ. ఐ. సి. సి. సభావేదికపై కానవచ్చిన దృశ్యాలు స్పష్టపరిచాయి.

రాష్ట్రం దృష్ట్యా కూడా ఇదే రీతి కానవచ్చింది. వేదికమీద ఆసీనులైనవారిలో మాజీ—కాంగ్రెసు అధ్యక్షుడు, శ్రీ దామోదరం సంజీవయ్యగారు, శ్రీ బూర్గుల రామకృష్ణారావుగార్లు ఉన్నారు డెలిగేట్లలో కూర్చున్నవారిలో శ్రీ గోపాలరెడ్డి, శ్రీ కొండా వెంకటరంగారెడ్డి, శ్రీ కొట్టిపాటి బ్రహ్మయ్య, శ్రీ పిడతల రంగారెడ్డి ప్రభృతులు ఉన్నారు. వీరందరూ ప్రదేశ్ కాంగ్రెసుకు నాయకత్వం వహించినవారే. కాని, వీరికి సభాగౌరవం జరక్కపోవడం శోచనీయం. తీర్మానాలపై చర్చలలో పాల్గొనడానికి ఆహ్వానించకపోవడం అన్యాయం. ఫోటోలు తీయించుకోవడంలో ముచ్చటపడే చోటా నాయకులకు వేదికమీద చోటివ్వడం గర్హనీయం.

గుంటూరు ఏ. ఐ. సి. సి. చర్చల సరళి, ఆమోదించిన తీర్మానాల ధోరణి మొత్తంమీద అవాస్తవికంగా ఉంది. అంతర్జాతీయ పరిస్థితులు, అందులోను కమ్యూనిస్టు చైనా అణుబాంబును తయారుచేయడం, భారతదేశం కూడా అణ్వస్త్రాలు తయారుచేయాలా లేదా అన్నది ముందుగా చర్చకు వచ్చింది. విదేశాంగమంత్రి శ్రీ స్వర్ణసింగ్, మాజీ రక్షణ మంత్రి శ్రీ కృష్ణమీనన్, శ్రీ దేబర్, శ్రీ బ్రహ్మానందరెడ్డి, చివరకు ప్రధాని శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి ఈ చర్చలో పాల్గొని కాంగ్రెసు విధానాలను పునశ్చరణ చేశారు. గాంధీజీ అహింసా సిద్ధాంతాలు, నైతిక విలువలు, పండిట్ నెహ్రూ అలీన విధానం, ప్రపంచ నాయకత్వం వగైరాలను ఏకరువు పెట్టారు. కొత్త విషయం ఒక్కటీ చెప్పలేదు. ఇప్పటి విధానాలు మారాలని వాదించిన శ్రీ బిజూ పట్నాయక్, శ్రీ పి. వి. నరసింహారావు, శ్రీ బిభూతి మిశ్రా, శ్రీ పాండే, శ్రీ అజాద్ ప్రభృతులు వాస్తవికదృష్టిని వ్యక్తంచేశారు. తమ వాదన సహేతుకమనిపించుకున్నారు.

ఇక అంతర్జాతీయ వ్యవహారాల తీర్మానాన్ని ప్రతిపాదిస్తూ శ్రీ బ్రహ్మానందరెడ్డిగారు చేసిన తెలుగు ప్రసంగం చాలామందికి ఆశ్చర్యం కలుగజేసింది. అంతర్జాతీయ వ్యవహారాలలో కూడా యింతగా ఆయనకు ప్రవేశం కలదా అనిపించింది.

## తీర్మానామోదం సరే, ఆచరణ?

రెండవ అధికార తీర్మానం ఆహార సమస్యకు సంబంధించినది. దీనిని వ్యతిరేకించాలనే అభిప్రాయం కొందరు ఆంధ్ర డెలిగేట్లు ప్రయివేటుగా వ్యక్తంచేశారు. కాని తీరా శ్రీ సంజీవరెడ్డిగారు దానిని ప్రతిపాదించడంతో ఏ ఒక్కరూ దానిని వ్యతిరేకిస్తూ మాట్లాడడానికి సాహసించలేకపోయారు. ఆ తీర్మానంలో ప్రభుత్వం నిర్ణయించిన ధరలకు ధాన్యాలను రైతులచేత విక్ర

౪౮ వ పేజీ చూడండి



శ్రీమతి లాల్‌బహదూర్‌తో, కూతురు, అల్లుడు, మనుమలు

న్యూఢిల్లీ లేఖ

# విదేశాల్లో భారతదేశ నిజ స్వరూపం ?

ఇతర దేశాలు మన గురించి—మన ఆర్థిక విధానం గురించి ఏమనుకుంటున్నాయి అనే కుతూహలంతో అమెరికాలాంటి పెద్ద దేశం ఇటీవల 14 కమ్యూనిస్టేతర దేశాలలో ఒక గాలప్–పోల్ (Gallup pole) జరిపింది. ఒక ప్రత్యేక వ్యక్తి అమెరికాను పారిశ్రామిక సంస్థ మొత్తంమీద 47 శాతం లాభం చేసుకోవచ్చునన్నప్పుడు—ఇలాంటి అంచనాలను ఎలా సరి చేసుకోవాలా అనే ఆందోళన కూడా అమెరికా పారిశ్రామికవేత్తలు వ్యక్తపరచటం జరిగింది. ఇది ఎందుకు రాస్తున్నామని అంటే "ఇలాంటి అభిప్రాయ సేకరణ, దురభిప్రాయ నివారణ అనే ప్రయత్నం మనవాళ్ళు విదేశాలలో చేస్తున్నారా" అన్న ప్రశ్న వేసుకొనేటందుకే!

మన దేశంలో వచ్చే ఏడాది ఫిబ్రవరి నెల 7వ తేదీ నుంచి 12వ తేదీదాకా అంతర్జాతీయ వాణిజ్య సంస్థల సమావేశం జరుగుతుంది. దానికి ముందు ఇటువంటి విషయ సేకరణ ముఖ్యం కాదా? రెండువేల మంది ప్రతినిధులు ఈ సమావేశానికి రావచ్చును.

డంకన్ ఓపెన్‌హామ్, జెర్మి రైస్మన్ లార్డ్ షాక్రాస్, లార్డ్ టాంగ్లీ లాంటి హేమా హేమీలు బ్రిటన్‌నించి వస్తారు. జర్మనీ నించి డా. ఏబిఎస్ వస్తారు. ఈయనే మూడో ప్రణాళికను కిమ్మత్తు కట్టనివి ప్రపంచ బ్యాంక్ ముగ్గురితో ఒకవిగా నియమించింది కూడా. అలాగే ఈ ఛాంబర్ ఆఫ్ కామర్స్‌కి అమెరికా ఫ్రాన్స్, ఇటలీలనించి పెద్దవాళ్లే వస్తారు. మరి మన ప్రభుత్వం, లేదా ఆతిధ్యం ఇస్తున్న వాణిజ్య సంస్థల ఫెడరేషన్‌గాని మన దేశ స్వరూపాన్ని ఎలా ఇస్తారో మనకేం ఇంతవరకు తెలియడంలేదు. తెలిసిన కాస్త ఇలా ఉంది—వచ్చిన ప్రతినిధివర్గం ప్రముఖ హోటళ్లల్లో ఉంటారు. ఉండి పత్రికల్లో అప్పి ంకా స్వరూపాలు చదువుతూంటారు. సదాచార సంఘాలు తిండి గింజల కటకట, ఆర్థికనెప్పి, దాని పర్యవసానంతోపాటు, మంత్రుల మంత్రివర్గ ఐక్య 'బాధ్యత'కు వ్యతిరేకంగాగల వ్యాఖ్యానాలు కూడా వింటారు. సహాఖ్య విధానం ఈలాగా కేంద్రాన్ని కాదనే రాష్ట్ర ముఖ్యమంత్రులను కూడ చూస్తారు. ఇదికాక ఫెడరేషన్ వారు ఏదో ఒక సెమినార్ ప్రదర్శిస్తారు. అందులో సమస్తమూ విఫలమవుతుంది తప్ప గత్యంతరంలేదని అరువు పన్నుల సమస్య అలాంటిదని చెప్పారేమో.....దీనితోపాటు, కట్టుదిట్టంగా, సంకలనం చెయ్యడంలో దేశీయమైన సాంకేతిక ఆధిక్యతను ప్రదర్శించే ఎగ్జిబిషన్ కూడా ఉంటే మేలు. సాంస్కృతిక సమావేశాల్లో ఆరోగ్యశాఖ, కట్టుదిట్టాలశాఖ అధికార్ల ఫలితాలను చూపిస్తే మరీ బాగు. ప్రతినిధులకు, ప్రస్తుతం వున్న రోడ్లను అలాగేవుంచి విలాస విహారాల ఏర్పాటు చేయడం ఇంకా బాగు. ఇలాంటి ఇంకా ఎన్నో వాస్తవిక చిత్రణలు చేస్తేగాని భారతదేశపు ప్రస్తుత భౌతిక స్వరూపం ఇతరులకు అవగాహన కాకపోవచ్చును. ఇదేదో వేళాకోళంగా రాస్తున్నామనుకోకండి. రోజా బ్రహ్మాండమైన శీర్షికల క్రింద పత్రికలలో ఇవేకదూ మనం చూస్తున్నాము. అంతర్జాతీయ వాణిజ్య సంస్థల సమావేశంలో మన దేశపు నిజ స్వరూప వివరణ చాలా ముఖ్యం. ఎందుకంటారా ?

ఇక్కడ్నుంచి ప్రతినిధులు ఏ స్వరూపాన్ని అవగాహన చేసుకుని వెళ్తారో దానిమీదనే ప్రయివేటు రంగపు అభివృద్ధి ఉండగలదు. దీన్ని మన ఢిల్లీలో పెద్దలు గ్రహించాలనుకోండి. పోతే ఈ సమగ్ర స్వరూప చిత్రణను ప్రతినిధులకు ఇచ్చే బాధ్యతను ఫెడరేషనుమీదనే ఉంచేయడంకన్న, జపాన్‌కి ప్రపంచ బ్యాంక్ సమావేశాలకువెళ్ళి శ్రీ టి. టి. కృష్ణమాచారి ప్రాతినిధ్యాన్ని జపాన్ ఈ విషయాన్ని ఎలా సమర్థించింది చూసి ఉన్నారు గనుక అడగటం భావ్యం. ఇంకా నాలుగో ప్రణాళికా ప్రగతి ప్రయివేటు రంగంలో విదేశ సాయంమీద ఆధారపడనున్నది గనుక కూడా ఈ విషయం చాలా ముఖ్యం.

## రష్యా భారత సహకారం !

1965 సంవత్సరంలో భారత రష్యాల వాణిజ్య పారిశ్రామిక వ్యాపార మైత్రికి 10 సంవత్సరాలు పూర్తవుతాయి. 1955 సం. లో నెహ్రూ, కృశ్చేవ్ ఒకరి దేశాన్ని ఒకరు సందర్శించడంలో ప్రారంభమైన ఈ సహకారంవల్ల రష్యా సహకారంవల్ల కట్టడమైన ఆరు ప్రాజెక్టులు ఇప్పుడు పని చేస్తున్నాయి. అందులో సాలుసరి ఒక మిలియన్ టన్నుల ఉత్పత్తి గల భిలాయి ఉక్కు కర్మాగారం ఉంది! అంక్లేశ్వర్ నుంచి రోజుకి 2300 టన్నుల ముడి తైలం లభ్యమవగలదు. నైవేలీ థర్మల్ పవర్ స్టేషన్ మరొకటి. ఇవిగాక రాంచిలోని భారీ పరికరాల కర్మాగారం, దుర్గాపూర్‌లోని బొగ్గు గనుల పరికరాల కర్మాగారం ఉన్నాయి. 24 ప్రాజెక్టులు నిర్మాణంలో ఉన్నాయి. భిలాయ్ విస్తరణ హార్ద్వార్‌లో భారీ పరికరాల కర్మాగారం మొదలైనవి ఇందులో ముఖ్యంశాలు. 30 లక్షల టన్నుల ముడి తైలం ఇవ్వగల మూడు తైలశుద్ధి కర్మాగారాలు ఈ పథకంలో ఉన్నాయి.

ఇవన్నీ పూర్తయి పనిచేస్తూ ఉంటే వాటివల్ల సాలీనా 25 లక్షల టన్నుల ఉక్కు, 60 లక్షల టన్నుల పెట్రోలియం సరుకులు, 125000 టన్నుల మేరకు అధునాతన భారీ పరిశ్రమల పరికరాలు లభిస్తాయి. విద్యుత్ ఉత్పత్తి 3 వ ప్రణాళికలో దేశం మొత్తంమీద ఎంత లభ్యం కావలసి ఉందో దానిలో 35 శాతం యీ భారత్ రష్యా సహకార ప్రాజెక్టుల ద్వారా లభ్యం కాగలదని లెక్క !

* * *

బెంగుళూరులో జరిగిన ఇండియన్ లేబర్ కాన్ఫరెన్సులో కార్మికుల వేతనాల్లో కొంత భాగాన్ని పొదుపు రూపేణా యివ్వడాన్ని సూత్రప్రాయంగా ఒప్పుకుంటూ తీర్మానించింది. పారిశ్రామికసంస్థ ఒప్పందపు స్థాయీసంఘం దీని పథకాన్ని రూపొందించాల్సి ఉంది. కాని యిక్కడ సమావేశమైన ఆ సంఘం లేబర్‌కు ఇది సమ్మతంగాలేదని దీన్ని త్రోసిపుచ్చింది. కార్మిక ప్రతినిధులు తమ వ్యతిరేకతను యీ సమావేశంలో చెబుతూ కేరళ గవర్నర్ శ్రీ వి.వి.గిరి తమకు ఈ విషయంలో సలహా ఇచ్చారని పేర్కొన్నారు.

ఇది నాన్నమ్మితే రెండు సందేహాలు, రెండు ఇబ్బందులు తల ఎత్తుతాయి! గవర్నరు రాజకీయ వివాదంలో పాల్గొన వచ్చునా? అన్నది ఒకటి—లేబర్‌కి ఆయన ట్రేడ్‌యూనియన్ నాయకునిగా సలహా ఇస్తే లేదా ఇవ్వదలచుకుంటే, గవర్నర్‌గా ఉండటం ఎలా? గవర్నర్ పదవి దీనికి అతీతమైంది.

ఇక రెండో సందేహం 'వర్కర్ల' దృక్పథానికి చెందినది. బోనస్ కమిషన్ విషయంలో దాన్ని అవార్డులా భావించినట్లు—ప్రభుత్వం దానికి మార్పులు తేరాదన్నారు వెనుకటికి. ఇప్పుడు వేతనాలు కొంత పస్తురూపేణా ఇవ్వాలన్నది 'వర్కర్ల' సమ్మతితోనే జరిగినా, వాళ్ళ నిర్ణయానికే వాళ్ళు కట్టుబడమంటున్నారు. దాన్ని వాళ్ళు ఇష్టమైనట్లు మార్చుకోగల మంటారు. మరి ప్రభుత్వం మాత్రం బోనస్ సంఘం కేవలం సలహా ప్రాతిపదిక సంఘం కదా, దానిలో మార్పులు తేరాదా?

ఈ కమిటీ ప్రభుత్వ, ప్రయివేటు రంగాలలో సరసధరల దుకాణాలు, లేదా సహకార దుకాణాల స్థాపనకు, చెందిన విషయాలకు, చెందిన ఒక బిల్లును లాంఛ ప్రాయంగా అంగీకరించింది. ★

—శ్రీ కృష్ణ ★


వ్యతిరేకాభిప్రాయాలు


మైకేల్ స్కాట్
నాగా ఐక్యతా ప్రయత్నం


నల్లధనం
కాంగ్రెస్ నిధులు


కేరళలో చైనా చెయ్యి
ఎడమ పక్షానికే ఓటు
ఎడమ పక్షానికే ఓటు

# తలనొప్పి
ఎక్కువగా ఉన్నా
# తలకేగా!

# అమృతాంజనం

## వాడి శీఘ్రంగా నివారణ పొందండి

స్థానికంగా ఉండే బాధను నివారించుకోడానికి ఊరికే మందులు ఎందుకు పుచ్చుకుంటారు? నొప్పి ఉన్న చోటుమీద అమృతాంజన్ రాసి అమోఘంగా శీఘ్రంగా నివారణను పొందండి. ఏ అపాయం లేకుండా కండరాల నొప్పులకు, తల నొప్పికి, బెణుకులకు ఇంకా కీళ్ల నొప్పులకు అమోఘంగా గుణమిచ్చే అమృతాంజన్ 10 రకాల ఔషధాలు చేరిన మందు. అమృతాంజన్ గుండెజలుబుకే కాక సాధారణ జలుబులకు కూడా మంచి మందు. కొంచెంకొంచెమే ఉపయోగించవలసి ఉంటుంది కాబట్టి ఒక సీసా మీ కుటుంబాని క..తాకలిపి నెలల తరబడి వస్తుంది.

అవసరానికి—ఎప్పుడూ అమృతాంజన్ ఉంచుకోండి. అమృతాంజన్ 70 ఏళ్ల ప్రసిద్ధిని పొందిన నమ్మకమైన గృహఔషధం.




అమృతాంజన్ <u>నొప్పులు జలుబుల</u> నివారణకు 10 రకాల ఔషధాలు చేరిన మందు

అమృతాంజన్ లిమిటెడ్,
మద్రాసు - బొంబాయి - కలకత్తా - ఢిల్లీ

IWT/AM/2019

# పీచు

*అలోక్*



**ఉపోద్ఘాతం :**

''కాదేదీ కవిత కనర్హం'' అన్న శ్రీ శ్రీ గారి ధర్మమా అని, మున్నెన్నడూ గ్రంధస్థంకాని వస్తువులన్నీ కావ్య వస్తువులు కాగల మహదవకాశం లభించింది. వాటిలో ఒకటీ పీచు !

'విపులాచ పృథ్వీ' అని, ఎన్నో వస్తువులుండగా పీచు నెన్నుకోడానికి కారణమేమిటి ? పీచు ప్రత్యేకత యేమిటి ? — అన్న సందేహం చదువరులకు కలుగుతుంది.

తిక్కనకు హరిహరనాథుడు, పోతనకు శ్రీరామచంద్రమూర్తి ఆదేశించినట్టు, పీచు జ్ఞానానంద స్వాములవారు కనిపించి పీచు గురించి వ్రాయమని సెలవిచ్చారు. ఆయన గెడ్డాం, మీసం, పండు జుత్తూ వెండి పీచులా విరాజిల్లుతున్నాయి. నాకు గుండెలు పీచు పీచు మంటున్నాయి. ధైర్యం చిక్కబట్టుకుని, ''చిత్తం! ఎలా వ్రాయమన్నారు?'' అని అడిగాను.

మానవుని పురోగమనానికి ప్రశ్నే కదా మూలకందం ? ప్రశ్న లేకపోతే ప్రగతి లేదు, పీచూ లేదు! కనుక !!

ప్రశ్నించగా, ఆయన ఒకింత నవ్వి,

''చరితం పీచు పీచస్య
శత పంక్తి ప్రవిస్తరం.''

అని, అంతర్థాన మయ్యారు. నాకు బోధపడలేదు. నిఘంటువు తిరగేశాను. చేసి, విశేష్యం అని తెలియజేస్తూ, అర్థం నార అని ఎరుకపరిచారు. నిఘంటుకారులు.

*  *  *

**ఉపక్రమణిక :**

పీచు ప్రాచీనమైనది. నాగరికతా సౌకర్యాలూ సంపాదించుకోవడానికి నరుడు ప్రారంభించిన తొలి రోజులలో, పత్తి, పట్టు, నైలాను, టెర్లిను మొదలైనవి వలువలు కాని రోజులలో, మానవుల మానం ఆచ్ఛాదించడానికి ఉపకరించిందీ పీచే ! పీచు కట్టకపోతే, నాటి మానవుడు చలికి గడ్డకట్టిపోయేవాడు.... అలా ఆ మానవుడు నాగరికుడై, అచ్చు యంత్రం కనిపెట్టి, పిల్లలకి వాచక పుస్తకాలు ముద్రించాడు.

''తండ్రి గరగర
తల్లి పీచు పీచు
బిడ్డలు రత్న మాణిక్యాలు.''

అని, వాచక పుస్తకంలో సచిత్రంగా పొడుపు కథ ముద్రించాడు. దానికి విడుపు పనసపండు. ఇతర జిల్లాలలో ఏమంటారో గాని, మా జిల్లాలో పీచు మిఠాయి వీధుల్లో తిప్పి అమ్ముతారు. అల్లికలకీ, బొంత కుట్టడానికీ ఉపయోగించే దారపుండ (నూలుబంతి) పరిమాణంలో, తియ్యగా పీచుపీచుగా ఉంటుందీ మిఠాయి.

పరిమాణాలలో వ్యత్యాసాలున్నా సంచులన్నీ పీచుతో తయారయ్యేవే ! స్టేటు బ్యాంకులో చిల్లర సంచులూ, ఎరువులూ, సిమెంటూ నింపిన సంచులూ, బియ్యం, చీనీ మొదలైనవి ఉండే సంచులూ, జనప పీచుతో తయారుచేస్తారు. పీచు అత్యుత్తమ కమర్షియల్ క్రాప్ ! ఇంగిలీపీచులో ఎందుకు చెప్పానంటే, 'వ్యాపార పంట' సరైన సమానం గనుక ! ''సంచులకుపయోగించేది పీచు కాదూ, దాన్ని నార అంటారు'' అని సవరణ ప్రతిపాదించాడు నా మిత్రుడు. పీచంటే కొబ్బరి పీచు మాత్రమేనట. అందుకని కొబ్బరి పీచు గురించి చెప్తాను.

పాఠక సామాన్యానికి అర్థంకాని కవిత్వం వ్రాస్తే నారికేళపాకం అంటారు. ఆ పాకం రుచి చూడాలంటే పీచు వొలిచి, చిప్పగొట్టి, నీళ్ళు పట్టి— తాగాలి. ఇంత బాధపడితేగాని, ఆ పాకం బోధపడదు. పాదరజోలేశం తుడుచుకునే మెత్తలు— గుమ్మాల ముందుంచబడేవి, కొబ్బరిపీచు నిర్మితాలే! అంతేకాదు .... కొబ్బరిపీచుతో త్రాళ్ళు పేనుతారు. ఎక్కువగా చేదలకి (బొక్కెనలకి) కట్టడంచేత అవి చేదతాళ్ళుగా చెప్పబడి, క్రమంగా చేంతాళ్ళయేయి. వీటికి ప్రసిద్ధి చెంగల్రావుపేట (విశాఖపట్నంలో). ఈ తాళ్ళ పరిశ్రమకి—సారీ—తాళ్ళ పరిశ్రమకి విశాఖపట్నం కేంద్రం కాదు. అక్కడి నూతులు లోతు. రెండు మూడు తాళ్ళు కడితేగాని నీళ్ళందవు.

తాడుతో తోడితే నీళ్ళు దొరికినట్టే, కలి కాలంలో దేవుణ్ణి స్మరిస్తే ముక్తి దొరుకుతుందట. ఎన్నడూ దేవుని తలవని ఒక సంపన్నుడైన వ్యక్తి లోని జీవుడు, దేహాన్ని వొదిలే కాల మాసన్నమైంది. బీరకాయ పీచులాటి చుట్టరికాలు కలుపుకుని దూరందూరపు బంధువులంతా ఆసన్నమయేరు. అతను హరీ అనే ముందు హరినామస్మరణ చేయించి, ముక్తి యిప్పించాలని వాళ్ళ తాపత్రయం. ఇంత నార తీసుకొచ్చారు. నారాయణ అంటే వచ్చే ముక్తిలో, సగమేనా, నార అంటే వస్తుందని !

50వ పేజీ చూడండి

# యుకారిస్ట్ కాంగ్రెస్!



ఇండియా వస్తున్న పోప్ పాల్

యుకారిస్ట్ కాంగ్రెస్ రోమన్ కాథలిక్‌లకు సంబంధించిన ఒక పెద్దసభ. ఇది నవంబరు ఆఖరున బొంబాయిలో జరుగనున్నది దీనికి రోమన్ కాథలిక్‌ల అధిపతి అయిన 'పోప్' కూడా రాబోతున్నారుట. ఈ సభ కోసం ఎన్నో ఏర్పాట్లు పెద్ద పెట్టున జరుగుతున్నాయి. ఈ ఏర్పాట్లకు భారత దేశ ప్రభుత్వం వీలయినంత సహాయం చేస్తోంది. అంతేకాక, ప్రధానమంత్రి, రాష్ట్రపతి, మొదలయిన వారు పోప్‌ని కలుసుకునేందుకని బొంబాయి వెడతారుట.

ఇంతదాకా, పోప్ బయట దేశాలలో జరిగే ఉత్సవాలకి వెళ్ళలేదుట. కాబట్టి, ఇది ఒక గొప్ప విశేషంగా ఊహించి మన ప్రభుత్వం యింత గౌరవం చేయ దలచినదని ఊహించినా తప్పు లేదు. కాని, భారత దేశంలో కొన్ని వర్గాలవారు 'యుకారిస్ట్' సభని పోప్ చేసే ఒక దండయాత్రగా, హైందవమతం మీద దాడిగా భావించి, తమ నిరసన ప్రకటిస్తున్నారు. పోప్ వచ్చినప్పుడు 'నిరసన ప్రదర్శనలు' వారి ఉద్దేశమని కూడా తెలుస్తోంది! ఈ వర్గాలవారి ఉద్దేశ్యాలు ఎంత దాకా ఫలిస్తాయో చెప్పటం కష్టం. అయితే—రోమన్ కాథలిక్ మతాధిపతి భారత దేశంలో జరిగే ఒక సభకి రావటం ఉచితమా, కాదా? ఆయనని ప్రధానమంత్రి, రాష్ట్రపతి స్వయంగా వెళ్ళి చూడటం ఎంతవరకు సబబు?—ఈ రెండు ప్రశ్నలు వేసుకుంటే గాని ఈ సందర్భంలో జరిగే వాదవివాదాలని నిష్పక్షపాతంగా పరిశీలించ లేము.

భారత దేశపు రాజ్యాంగం మత ప్రధానమయినది కాదు. భారత దేశంది 'సెక్యులర్' విధానం. ఇక్కడ నివసించే ప్రజలందరికీ తమ మతాలకి సంబంధించిన ఆచారాలని - ఇతరులకి హాని కలిగించకుండా - పాటించే హక్కు ఉంది ఈ హక్కు— రోమన్ కాథలిక్‌లకీ ఉంది 'యుకారిస్ట్ సభ' వారిమతానికి సంబంధించిన ముఖ్య కార్యక్రమాలలో ఒకటి. ఇది జరిపినంత మాత్రాన భారత దేశంలో ఇతరులకి కలిగే హాని ఏమిటో అర్థం కాదు. ఇక, ఈ సభకి ఆ మతంవారు తమ అధిపతిని పిలుచుకుంటున్నారు. ఇందులో ఉండే అనౌచిత్యం ఏమిటో కూడా అర్థం కాదు.

'హైందవ మతం మీద ఈ విధంగా దాడి చెయ్యటానికి ప్రయత్నిస్తున్నార'ని కొందరి ఆరోపణ. బౌద్ధ, మహమ్మదీయ, మతాలలాగే క్రైస్తవ మతం కూడా ఇతరులను తనలో చేర్చుకోవాలని ఆశిస్తుంది. ఇందులో కొత్త ఏమీ లేదు. ఇది పందొమ్మిది వందల ఏళ్ళ పైగా ఉన్నదే. రోమన్ కాథలిక్ మతం క్రైస్తవ మతంలో ఒక భాగం.

ఈ తెగవారు భారత దేశంలో చాలా కాలం నుంచి తమ మత ప్రచారం చేసుకుంటున్నారు ఇన్నాళ్ళుగా లేనిది, ఈ యుకారిస్ట్ కాంగ్రెసు వల్ల హైందవ మతానికి గాని, భారత దేశానికి గాని వాటిల్లే ప్రమాదం ఏమిటి? శతాబ్దాలుగా బ్రిటిష్ ప్రభుత్వం [illegible] బలం కొన్ని రోజులు మాత్రం జరిగే ఈ సభ ద్వారా కాథలిక్‌లకి వచ్చేస్తుందా? అసలు ఇంత మాత్రం ప్రచారానికి హైందవ మతం తట్టుకోలేదా? నిదానంగా ఆలోచించి చూస్తే పై ప్రశ్నలన్నిటికీ ఒకే రకం సమాధానం దొరుకుతుంది

ఇక ప్రధాన మంత్రి, రాష్ట్రపతుల బొంబాయి యాత్ర విషయం పరిశీలించవలసి వస్తుంది పోప్‌ని ఒక ప్రత్యేక 'రాజ్య'పు అధిపతిగా పరిగణించి, 'వాటికన్'లో భారత దేశం ఒక రాయబారిని నియమించింది. అందుచేత ఈ దేశం అధిపతులు పోప్‌ని వెళ్ళి సందర్శించటంలో అనుచిత మేమయిన దేమీ ఉన్నట్లు కనిపించదు పైగా ఈ దేశానికి వస్తున్న ఒక మతాధికారిని నిరసన ప్రదర్శనలతో 'ఆహ్వానించటం' అలా చేసే వారి అనాగరికతని సూచించటమే కాక తక్కిన వారందరినీ ఇబ్బందిలో పెట్టినట్లే అవుతుంది.

—ఒక విలేఖరి.

# చికిత్సల అవధులు - 2

## డేవిడ్ ఎట్రిక్

### ఉన్మాదము

ఇదీ ఒక జబ్బే. ఈ జబ్బు చికిత్సలోనూ చాలా పరిశోధనలు జరుగుతున్నాయి. ఏదయినా ఒక పరిశోధన కేంద్రానికెళ్ళి చూడండి, తక్కిన వ్యాధుల చికిత్స పరిశోధన జరిగేచోట్ల కనిపించే సామగ్రి కనిపిస్తుంది—టెస్ట్ ట్యూబులు, శరీరంలో ధార్మిక శక్తిని కొలిచే యంత్రాలు, విద్యుచ్ఛక్తి పరికరాలు. . . .

మానవ జాతిని అత్యధికంగా పీడించే జబ్బు ఏది? పుట్టకురుపా, కీళ్ళనొప్పా, జలుబా? వీటిలో ఏదీ కాదు. ఉన్మాదమే నేటి ప్రపంచ ప్రజలని బాధ పెట్టే వ్యాధి.

మరి, ఈ వ్యాధి చికిత్స అవధులు ఎంత దాకా ఉన్నాయనుకోవచ్చు?

ఈనాడు డాక్టర్లు పిచ్చిని భౌతికంగా, రసాయన శాస్త్రం దృష్ట్యా, అనుశీలిస్తున్నారు. దూరపు చూపుతో పరిశోధనా ప్రణాళికలని నిర్మిస్తున్నారు.

ఈ అవధులవద్ద నుంచున్నవారికి విచిత్రానుభూతులు కలుగుతాయి. ఆధునిక వైద్యశాస్త్రంలో జరగవలసిన అతి ముఖ్యమయిన పురోగమనం ఈ రంగంలోనే ఉండటంలో అతిశయోక్తి లేదు.....

ఉన్మాదంవల్ల తక్కిన జబ్బుల మూలంగా కన్నా అధికంగా వ్యక్తులు చనిపోతున్నారా? లేదు. కాని జీవితాన్నే దుర్భరంచేసే మానసిక పరిస్థితిని ఏవిధంగా వర్ణించగలం? (బ్రిటన్‌లో మనస్సు చెదిపోయి ఆత్మహత్యకి లోనయ్యేవారి సంఖ్య కారు ప్రమాదాలలో మరణించేవారి సంఖ్యతో, ఇంచు మించు, సమానంగా ఉంటుందట!)

ఈ ఉన్మాదం అనే అస్వస్థత ఎంత దారుణమయినదో మానసిక వ్యాధులతో బాధపడుతున్న వ్యక్తులు లేని కుటుంబాల వారికి తెలియదు.

బ్రిటన్ సంగతి తీసుకోండి. మొత్తం ఆస్పత్రులలోని 'బెడ్' (మంచము!) లని ఆక్రమించే వారిలో సగం మంది పిచ్చివారికిందనే జమ.

ఇక దేశం మొత్తంమీద, ప్రతి 20 మందిలో వ్యక్తి ఉన్మాదానికి లోనయ్యే అవకాశం ఉందిట.

పరిశ్రమలలో 'అబ్సెంటీసం' (పని ఎగకొట్టటం.) కార్మికుల మానసిక అస్వస్థతేనని నిపుణులు చెబుతున్నారు.

ఇదంతా ఆధునిక ప్రపంచపు ధోరణి వల్లనేనా? నవ నాగరిక జీవితపు వత్తిడికి తట్టుకోవ లేక పిచ్చివారయి పోతున్నారా మనుష్యులు?

నిపుణులు—శాస్త్రజ్ఞులు కాదంటున్నారు. ఉన్మాదం రోజు రోజుకి ఎక్కువ మందిని బలి గొనటం లేదని వారి అభిప్రాయం.

అయితే, ఉన్మాదం ధైర్యంగా ఎదుర్కొనవలసిన ఒక పెనుభూతం, అని మాత్రం హెచ్చరిస్తున్నారు.

అసలు ఉన్మాదం ఎటువంటి జబ్బు?

ఎన్ని రకాల ఉన్మాద స్థితులు ఉన్నాయో పరిశీలించిచూస్తే ఈ ప్రశ్నకి ఒక విధమయిన సమాధానం దొరుకుతుంది. మొత్తం నాలుగు రకాల పిచ్చిలు ఉన్నాయి. [మందమతి గుణం పిచ్చి కింద జమ కట్టబడదు]

### షిజోఫ్రెనియా

నూటిలో ఒకరికి ఈ రకపు పిచ్చి ఉంటుందిట. ఇంకో విధంగా చెప్పాలంటే, క్షయరోగం కన్నా నాలుగురెట్లు ఎక్కువగా వస్తుందన్నమాట. (ఇది బ్రిటన్‌కి మాత్రం వర్తిస్తుందని తోస్తుంది— సం. ఆం. స. వా. ప.)

పుస్తకాలలో సరదాగా వర్ణించే జబ్బుకాదు. వ్యక్తిత్వాన్ని పూర్తిగా నాశనం చేసేది. ఇది యువతీ యువకులనే అధికంగా పీడిస్తుందట.

షిజోఫ్రెనియా లక్షణాలు—అర్థం లేకుండా మాట్లాడటం, ఏవేవో వింత శబ్దాలు వినిపించాయనుకోవటం, కుట్రలకి గురి అయినట్లు భయపడటం, భావాలు రేడియో టెలివిషన్‌లవలె ప్రసారం చెయ్యగల మనుకోవటం. సాధారణంగా 'పిచ్చి' అంటే ఇదే మనసులో ఉంచుకుని అనే మాట.

### మానిక్ డిప్రెసివ్

శారీరక వ్యాధులు మనస్సుని కూడా మారుస్తాయన్నది అందరికీ తెలిసిన విషయమే.

వేడి దేశాలలో శారీరక వ్యాధులు మనిషిని ఉద్వేగ పరుస్తాయట.

చలి దేశాలలో వారిని విపరీతమయిన నిస్పృహకి దారి తీస్తాయట.

### న్యూరోసెస్

మానసికాభివృద్ధి సరిగ్గా జరగకపోతే వచ్చే పరిస్థితి లక్షణాలని 'న్యూరోసెస్'గా వర్ణిస్తారు. ఈ పరిస్థితికి లోనయినవారు విపరీతమయిన భయంతో, నిస్పృహతో, బాధపడ్తారు.

### శారీరిక పరిణామాలవల్ల కలిగే ఉన్మాదం

మొదడులో భౌతికమయిన మార్పు లేవయినా కలిగినా పిచ్చి రావచ్చు. సిఫిలిస్ ఉన్మాదానికి దారి తీసే వ్యాధుల్లో ఒకటి.

ఈ వ్యాధులు పిచ్చినెందుకు కలిగిస్తాయి? జవాబు చెప్పటం కష్టం. కాని, ఒక 'మెరుగు' ఏమిటంటే, నేటి పరిస్థితులలో పిచ్చి తగ్గుముఖమే పడ్తుందని నిపుణులు చెబుతున్నారు. అదీకాక, ఉన్మాదుల విషయమయి సానుభూతి కూడా హెచ్చు అవుతుందట. [మరొ.—మంద కొడితనం లేక బుద్ధిమాంద్యం మాత్రం ఎక్కువౌతోందట. ఆధునిక వైద్యశాస్త్ర పురోగమనంవల్ల చనిపోయేవారి సంఖ్య అసలు తగ్గిపోయి 'బుద్ధి తక్కువ' వారి సంఖ్య పెరుగుతోందన్నమాట]

ఒక రకం బుద్ధిమాంద్యులు 'చైనా కళ్ళ'తో పుడ్తారు. పూర్వకాలంలో ఇటువంటి శిశువులు చిన్నప్పుడే పోయేవారు. ఇప్పుడు ప్రతివారి వయస్సు సంవత్సరాలు జీవించేవారు. ఇప్పుడేమో 40 వయస్సు నిండిన 'చైనా కళ్ళ' వాళ్ళు బుద్ధిమాంద్యంలో ఉన్నారు.

### చికిత్స-పరిశోధన

చికిత్స—పరిశోధన విషయంలో నేటి పరిశోధన ఎలా ఉంది?

'షిజోఫ్రెనియా' విషయంలో విశేషమయిన అభివృద్ధి జరిగిందనే చెప్పాలి. ఈ రకం పిచ్చి ఉన్న వారిని 'ట్రాంక్విలయిజర్' మందుల ద్వారా, ఆదర్శాల ద్వారా ఆస్పత్రులనుంచి తప్పించి తమ తమ వారితో జీవించే ఏర్పాట్లు చేస్తున్నారు. 'ట్రాంక్విలయిజర్'లు మానసిక స్థితిని ప్రశాంతం చేస్తాయి, అందువల్ల ఇది 'నిజమయిన చికిత్సా' లేక కేవలం 'అణచి వేయటమా' అనే ప్రశ్న వేసేవారూ లేక పోలేదు. కాని మెదడు మీద మందుల ప్రభావం ఎటువంటిదో సరిగ్గా తెలియదు కాబట్టి ఫలితాలనిబట్టి ఏదో కొంత పురోగమనం జరుగుతూనే ఉందని ఊహించాలి.

ఈ ధోరణి సాగితే, బ్రిటన్‌వంటి దేశంలో 'ట్రాంక్విలయిజర్'లవల్ల ఆస్పత్రులలో మంచాల సంఖ్య క్రమంగా తగ్గిపోవచ్చు.

షిజోఫ్రెనియాని ఎప్పటికయినా మందులతో నిర్మూలించవచ్చునని శాస్త్రజ్ఞుల అభిప్రాయం.



**పుష్పము మీ అదృష్టం చెప్పగలదు**

మీ భవిష్యత్తులో ఏమి జరుగబోవునదిన్నీ,మీ వరియైన చర్యను గురించిన్నీ మీరు తెలుసుకొనగోరినట్లయితే ఒక పోస్టుకార్డుపైన మీకు ఇష్టమగు ఒక పుష్పము పేరున్నూ, మీరు వ్రాయు తేదీ, వేళవివరములున్నూ, మీ సరియైన విరునామాయున్నూ వెంటనే వ్రాసిపంపండి. జ్యోతిషశాస్త్రములోని రహస్య గణితము మూలముగామేము గుణించి, మీరు కార్డు వ్రాసినతేదీ లగాయతు 12 మాసములలోను మీయొక్క అదృష్టము, లాభనష్టములు, జీవిత మార్గము,ఏ వ్యవహారములో మీకు జయము కలుగునో, ఉద్యోగం విషయంలో మంచిచెడ్డలు,మార్పులు,ఆరోగ్యవిషయము, పరదేశగమనము, తీర్థయాత్రలు, వివాహము, స్త్రీసుఖము, సంతానము, నిధినిక్షేపములు, లాటరీ, అకస్మా ద్రవ్యలాభము. మొదలగువానిని గురించి స్పష్టముగా మాసవారీగా వ్రాసి రు.1.25న. పై. లకు మాత్రము వి. పి. గా పంపగలము. (వి. పి. ఛార్జీలు ప్రత్యేకం). దుష్టగ్రహములేవైనా ఉన్నయెడల శాంతిచేయు విధానం కూడా తెలుపగలము. వివరములు వరా పూచీపై పంపబడును. మేము పంపిన భోగట్టా మీకు తృప్తిగా లేనిఎడల పైకము వాపసు చేయబడును. ఒకసారి పరీక్షించండి. అడ్రసు ఇంగ్లీషులో వ్రాయండి.

PT. DEV DUTT SHASTRI, RAJ JYOTHISHI (A.W.P)
P. B. 86, JULLUNDUR CITY.









**కేశాలంకరణ పోటీ!**

నవనవలాడే మీ దీర్ఘ కేశ సంపదకు మీరు గర్విస్తున్నారా?

అట్లా అయితే కేశవర్ధని ప్రొడక్ట్సు (జైలు రోడ్డు, కోయంబత్తూరు-1)వారికి,మీరుఉపయోగించిన కేశవర్ధని పాకెట్ కార్టన్(పట్టె)తో మీరు రమణీయంగా చేసుకున్న కేశాలంకరణతో తీయించుకున్న ఫోటోగ్రాఫునుపంపండి.

ఉపయోగకరమైన బహుమతి పొందండి.

ఆంధ్రప్రదేశ్ వారలకు మాత్రమే

ముగింపు తేది 31 డిసెంబరు 1964

* ప్రతి ఫోటోగ్రాఫును ఒక న్యాయనిర్ణేతలబృందం పరిశీలింపుతారు. వారిదే తుది నిర్ణయం.


# చికిత్సల అవధులు

కొన్ని మందులు పుచ్చుకుంటే 'షిజో(ఫ్రెనియా' వంటి 'మానసిక పరిస్థితి' ఏర్పడుతుంది. ఈ మందులకి విరుగుళ్ళు కనిపెడుతున్నారు కనుక ఒకప్పుడు కాకపోతే ఒకప్పుడు 'షిజో(ఫ్రెనియా'కి కూడా విరుగుళ్ళు కనిపెడ్తారని ఆశించవచ్చు.

ఇటువంటి విరుగుడు ఒకటి కనిపెట్టినా వారు వైద్యశాస్త్రంలో ఒక స్థానం [illegible] చేరినట్లే.

## షాక్ వైద్యం

విద్యుచ్ఛక్తి ద్వారా, ఇన్సులిన్ ద్వారా శరీరంలో షాక్‌లు కల్పించి పిచ్చిని కుదర్చటానికి ప్రయత్నించేవారు. క్రమంగా మందులతో ఉన్మాదానికి చికిత్సలు ఏర్పరచటానికి నేటి పరిశోధకులు ప్రయత్నిస్తున్నారు.

దేహంలో కొన్ని లవణాలు, హార్మోనులు తగ్గినా ఎక్కినా మతిభ్రమణం కలుగుతుందని నేటి పరిశోధకులు వూహిస్తున్నారు.

ఈ సందర్భంలో రేడియో ధార్మిక శక్తిగల 'ఐసోటోప్'లు (అణు కేంద్రాలలో బరువు తేడాలుగల ఒకే మూల పదార్థపు అణువు రూపాలు) చాలా ఉపయోగకరంగా ఉంటున్నాయి. [ఐసోటోపులుగల మందులు ఇచ్చి, వాటి రేడియో ధార్మిక శక్తి ద్వారా దేహంలో వాటిని అనుశీలించ వచ్చును.]

జీవకణంలో 'క్రోమోసోము' అనే పదార్థాలు ఉంటాయన్నది అందరికీ తెలుసు. ఇవే వంశ పరంపరంగా వచ్చే గుణాలకి ఆధారాలని కూడా అందరికీ తెలును. వీటిని అనుశీలించటంవల్ల తెలిసిన ఒక విచిత్ర విషయం 'మైనా కప్ప'తో పుట్టినవారికి 46 బదులు 47 క్రోమోసోములు ఉంటాయని!

అమెరికా, బ్రిటన్‌లలో జరిగే పరిశోధనల వల్ల తెలిసిన మరొక సంగతి ఏమిటంటే,షిజో(ఫ్రెనియా సాధారణంగా, పెద్ద పట్టణాలలో, పారిశ్రామిక కేంద్రాలలో వారికే ఎక్కువగా వస్తుందట.

ఇది వాతావరణం కల్పించే పరిస్థితి అని భావించాలా? లేక ఈ రకం పిచ్చికి లోనయ్యేవారు నాగరిక వాతావరణాన్ని కోరుతారా? పరిశోధనలు త్వరలో తెలుపవచ్చు.

## ఆత్మహత్య

ఆత్మహత్యకి ఆర్థిక పరిస్థితులకీ ఏకొంచెం సంబంధం లేదని పాశ్చాత్యదేశాలలో జరిగే పరిశోధనలు సూచిస్తున్నాయి. ఒంటరితనమే ముఖ్య కారణమట. అంటే సాంఘిక జీవితం సరిగ్గా ఉంటే ఆత్మహత్యలు తగ్గవచ్చు అన్న మాట.

ఏది ఏలా ఉన్నా, ఉన్మాదానికి మందులు కనిపెట్టవచ్చునన్న నమ్మకం శాస్త్రజ్ఞులలో బాగా నాటుకుపోతుందని మనదాహం.



# ఎదిగే పిల్లల సమస్య...

"విశాఖ"

పిల్లలు పెద్దవాళ్ళవుతున్నకొద్దీ తల్లిదండ్రులకి ఎదురయ్యే సమస్యలు అధికమవుతూ వస్తాయి. చదువు, వివాహం, ఉద్యోగం అన్నీ ఈ కాలంలో సమస్యలే. అందరూ ఎదుర్కోవలసినవేను. వీటితో బాటే ఇంకో సమస్య కూడా ఈ కాలంలో ఎక్కువగా కన్పడుతోంది. పధ్నాలుగేళ్ళ వయస్సు దాటిన తర్వాత పిల్లల మనస్సులు విచిత్రమైన విధంగా సంచరిస్తూ ఉంటాయి. ఈ క్లిష్టమైన ప్రాయంలోని పిల్లలు తల్లులకి కొరకరాని కొయ్యలుగా తయారవుతారు.

పసిప్రాయాన్ని వదిలి యవ్వనం ప్రారంభమయ్యే ముందు వారి దేహాల్లో కల్గే మార్పులతోబాటే మానసికంగానూ అనేకమార్పు లొస్తాయి. చుట్టాలూ పక్కాలు వస్తే పలకరించరు. ఎవరితోటి అట్టే మాట్లాడరు. ఎంతసేపూ పత్రికలు మొహాన్ని కట్టుకు కూర్చుంటారు. ప్రేమ కథలలోనూ, ప్రేమ నవలలోనూ ఆసక్తి చూపెడతారు. లేదా కొందరు రేడియోని ఇరవైనాలుగ్గంటలూ పెట్టుకు కూర్చుంటారు. ఎంతసేపూ సినిమా సంగీతం వింటారు. ఏపని చెప్పినా చెయ్యరు. చేతిలో సంచీ పట్టుకుని మార్కెట్టుకి వెళ్ళటం నామోషి అల వాటుగా చేసే చిన్న చిన్న పనులని చెయ్యడానికి కూడా పణుగుతారు.

## ఎంతసేపూ నవలలు

మొన్న నా స్నేహితురాలు సీతని చూడ్డానికి వెళ్ళినప్పుడు అది ఇలాగే వాపోయింది. వాళ్ళమ్మాయికి పదహారు వెళ్ళి పధ్నాలుగు వచ్చింది. ఎంతసేపూ నవలలు పట్టుకుని లేదా రేడియో ప్రక్కనే కూర్చుంటుం దిట. ఏపని చెప్పినా సణుగుతుంది. సాయంత్ర మయ్యేసరికి సింగారించుకుని స్నేహితురాళ్ళ ఇళ్ళకి వెళ్తుందిట. సీత బాధల్లా ఆ అమ్మాయి లంతా చేరినపుడు వాళ్ళ కబుర్లు చెప్పుకోవడం గూర్చి కాదు. ఎవరైనా అబ్బాయిలు కన్పడేసరికి వీళ్ళని చూసేటట్లుగా నడుచుకుంటారు. ఇది ఏమైనా అనర్థానికి దారితీస్తుందేమోనని సీత భయం. ఎవరూ తమ పిల్లల్ని గూర్చి సీతలాగా బయటికి చెప్పుకోరు. ఆవయస్సలాంటిది. గూటి లోంచి బయటికి వస్తున్న సీతాకోకచిలుకల్లాగ అమ్మాయిలకి అబ్బాయిలని ఆకర్షించాలన్న తాప త్రయం ఎక్కడా ఉన్నదేను. ఎక్కడో కొందరు అలా ఉండరు. ఇది ఏ అనర్థాలకి దారితీస్తుందోనన్న భయం పెద్దలకి ఉండడం— ఈ సమస్య అందరికీ ఉన్నదేను.

ఈ వయస్సులోని మగపిల్లలు గుంపులు గుంపులుగా చేరి ఆడవార్ని గూర్చి, లేదీ ఉద్దేశ్యమొచ్చి నట్లుమాట్లాడుతారు. ఆడపిల్లలు కనపడితే విసుర్లు విసురుతారు. ఇంక ఆడపిల్లల్లో—సాయంత్ర మయ్యే సరికి అలంకరించుకుని బయటికి వెళ్తారు. వల్లరి చేతా అందంగా ఉన్నామని అన్పించుకోవాలని తాప త్రయపడుతారు.

ఈ వయస్సులో వారిలో భౌతికంగా కల్గే మార్పులవలనవే ఈ మానసిక మార్పులన్నీను. మన జీవితంలో కూడా ఈ వయస్సులో ఇలాగే ఆందోళన లకి లోనయ్యామన్నది గుర్తుకు తెచ్చుకోవాలి. మాసిన నిక్కరుతో చొక్కాకి బొత్తామైనా పెట్టుకో కుండా ఆడుకోవడానికి వెళ్ళే అబ్బాయి టెర్లిన్ షర్టూ ప్యాంటూ కావాలంటాడు. ఇస్త్రీ మడత నలగని వోణి కావాలంటుంది అమ్మాయి. అలంక రించుకుని గుమ్మందగ్గర అది నిలబడుతుంది. ఒక్కొక్కప్పుడు వీరు బాహాటంగానే ఒకరి నొకరు ఆకర్షించుకోవాలని ప్రయత్నిస్తారు. చూసేవారికి వెగటు కల్గిస్తుంది ఇది.

ఎంత చెప్పినా వినరు. "నీ వయస్సుకి తగ్గట్లు నడుచుకోమంటే" ఎదిరించి జవాబిస్తారు. మరీ మరీ చెప్పితే మొండికేస్తారు. కనుక కొన్ని కొన్ని చూసీ చూడనట్లు వూరుకోవాలి. మెల్లగా నయానా చెప్పాలి. అంతేగాని ఒకేసారి ఆజ్ఞాపిస్తే మరీ మొండి కేస్తారు. మన అమ్మలు కూడా మనల్ని గూర్చి ఇలాగే బాధపడ్డారని జ్ఞాపకం తెచ్చుకోవాలి. మన అమ్మల కాలంలోలాగా మనం లేము. మన కాలంలోలాగా మన పిల్లలుండరని తెలుసుకోవాలి. అనేకసార్లు వాళ్ళు తప్పుచేస్తారు. చిన్నచిన్న విషయాల్లో పెద్దవారు ఖండించకుండా ఉండడమే మంచిది. చీర కట్టుకోవ డంలో, తల దువ్వుకోవడంలో, పూలు పెట్టుకోవ డంలో లాంటి చిన్న విషయాలలో వారిని వారి మానానికి వదిలేయాలి. అది మంచిది. అంతే గాని ఎంతసేపు "ఏమిటే ఆ పమిట వేసుకోవటం. నిండుగా కప్పుకో." అని సాధిస్తే "నేనేం అమ్మమ్మని గాను. క్రిందటికి దువ్వుకోవడానికి, పమిట కప్పుకో డానికీను" అని ఎదురు జవాబిస్తారు పిల్లలు. దాంతో తల్లి మనస్సు ఇంకా బాధపడుతుంది.

అతి లేత ప్రాయంలో ఎలాగ తల్లి సహాయం పిల్లలకి అవసరమో ఈ క్లిష్టప్రాయంలో కూడా తల్లి సహాయం పిల్లలకి అంతే అవసరం. ఈ సమ యంలో తల్లిగా కంటే ఉత్తమ స్నేహితురాలిగానో, స్నేహితుడుగానో సలహా లివ్వాలే గాని ఆంక్షలు పెట్టితే వాళ్ళు మొండివాళ్ళుగా తయారవుతారు. ఈ మొండితనమే అనర్థాలకి దారితీస్తుంది.

## 'టీనేజ్' సమస్యలు

అసలే ఈ ప్రాయంలో తమకే తెలియకుండా పిల్లల అంతరంగంలో జీవితపోరాటం ప్రారంభిస్తారు. అనేక దెబ్బలు తిన్నాకే ఎలాంటివారూ జీవితంలో సవ్యంగా నడవగలుగుతారు. అలాంటివి పిల్లలు ఏపాటి వారు ? వారికి మెల్లగా బోధించాలి. కొంతమంది వయస్సు వెళ్ళను వెళ్ళను ఈ పనులన్నీ మానేసి సరిగ్గా నడుచుకుంటారు. అలాంటివారు తాము క్రితం ఎలాగ అలా నడుచుకునేవారమా అని ఆశ్చర్య పోతారు. సాధారణంగా, సవ్యంగా, జాగ్రత్తగా పెంచ బడిన పిల్లలు ఈ "క్లిష్ట ప్రాయంలో" కాస్త ఇలాగ ప్రవర్తించినా కొన్నాళ్ళలో సర్దుకొంటారు. 24 గంటలూ సినిమాపాటలు ఎలా వినేవారమా! అని విస్మయం చెందుతారు. ఇలాంటివారి గూర్చి ఏ బెంగా లేదు.

కానీ కొందరు ఈ "క్లిష్ట ప్రాయంలో" అవకతవకపనులు చేసి జీవితాంతం ఆ మచ్చలను మోస్తారు. తమ తమ పిల్లల్ని గూర్చి వాస్తవమైన విషయాలు తల్లులు సేకరించాలి. వారిని గూర్చి క్షుణ్ణంగా తెలుసుకుని ఉంటే ఏ బాధలూ రావు. నయానా మెల్లగా అన్ని విషయాలూ బోధించాలి. గాలికి వారిని వదిలేస్తే గాలిపటంలాగా తిరిగి ఆఖర్న ఎక్కడో తెగిన గాలిపటంలాగ క్రింద పడిపోతారు.



మెల్లగా అర్థమయేటట్లు వివరిస్తే ఏ అనర్థాలూ రావు. పిల్లలు అన్ని విషయాలూ తల్లితో నమ్మకంతో చెప్పేటట్లు చెయ్యాలి. వారికి తల్లి నుంచి ఏ రహస్యాలూ ఉండకుండా చేసుకోవాలి. ఇంగ్లీషులో ఈ క్లిష్ట ప్రాయాన్నే "టీన్ ఏజ్" అంటారు. ఈ "టీన్ ఏజ్"నే ఆడోలెసన్సు అని కూడా అంటారు. తెలిసీ తెలియక అనర్థాలు తెచ్చుకునేది ఈ వయస్సులోనే. అందుకే ఈ వయస్సు పిల్లల్ని

# వనితాలోకం

జాగ్రత్తగా తల్లి కాపాడుకోవాలి. మెల్లగా అర్థమయేట్లు చెప్పాల్సినవి మాత్రం చెప్పి తన పిల్లల్ని బుజామార్గంలో పెట్టుకోడం తల్లి బాధ్యత. అంతే కాని "మా కాలంలో ఇలాంటివి ఎరుగుదుమా! మేం ఎప్పుడైనా ఎదురు జవాబు చెప్పేవారమా!" అని చెప్పక—కాలం మారింది, మనుష్యులూ మారుతున్నారని గుర్తించుకొని పిల్లల్ని అన్ని విషయాలలో అడ్డగించక చెప్పవలసినచోట చెప్పవలసినంత మాత్రమే చెప్పి పిల్లలకి అన్నీ తెలియచేయటం మొదట తల్లి బాధ్యత. రెండవది తండ్రి బాధ్యత.

ఈ మధ్యకాలంలో ఈ 'టీన్ ఏజ్' వారిని గూర్చి అతి ఘాటుగా విమర్శలు వింటున్నాం. యుగయుగాలుగా పెద్దవారు చిన్నవారిని విమర్శించడం కద్దు. ఇది సహజమైనదే. వేషంలో క్రొత్త ఫ్యాషన్లని అనుకరించినందువల్లనూ, నల్గురినీ ఆకర్షించాలని తాపత్రయపడినందువల్లనూ చెడిపోతున్నారనటం అవివేకం. పెద్దవారు అడుగడుగునా వారిని విమర్శించక వారిలోని మంచి గుణాలని గుర్తించడం మొదలుపెట్టాలి.

పాతకాలపు పద్ధతులని త్యజించి నూతనాన్ని అభిలషించి పోరాడుతున్న ఈ క్లిష్టప్రాయపు వారియొక్క తప్పులని పెద్దవిగా భూతద్దంతో చూడ్డం మానేసి వారివారి అభిలాషలను గుర్తించి వాటి కనుగుణంగా వారి ఆసక్తులని పెంపొందింప చేయాలి. మనమూ మన 'టీన్ ఏజ్' మన పెద్దవారికి వ్యతిరేకంగా చేయాలనే ఉద్దేశంతో పోరాడినవారమే. కాని వయస్సుమీద పడ్డకొద్దీ, మనం మన పెద్దవారి దారినే వెళుతున్నాము. మరి కాలేజీ రోజుల్లో మోటన్పించినవన్నీ ఇప్పుడు మనకి నచ్చుతున్నాయి. అలాగే వీరూ పెద్దవారయ్యాక ఈ చిన్న చిన్న విషయాలన్నీ త్యజించి పక్వమొందుతారు.

కాని తల్లితండ్రులు తమ పిల్లలకి ఈ వయస్సులో ఆప్త మిత్రులుగా మెలగి వారిని మంచి దారిలోకి తెచ్చుకోవాలి. ఈ వయస్సులో వారికీ, వారి తల్లితండ్రులకీ మధ్య రహస్యాలూ, అడ్డు తెరలూ లేకపోతే ఒకరినొకరు అర్థం చేసుకోవడం సులువు. అప్పుడే అనర్థాలు రావు. ఈ సమస్య మంచు తెరలా విడిపోతుంది.


పండిత
డి. గోపాలాచార్యులవారి
జీవామృతం
ఆరోగ్యానికి బలానికి
ఆయుర్వేదాశ్రమం
(ప్రైవేట్) లిమిటెడ్
మదరాసు-17

డాక్టర్ వృత్తి చేయండి
విరామకాలంలో ఇంటిలో పోస్టల్ ట్యూషన్ద్వారా హోమియోపతి చదివి, గవర్నమెంటు రిజిష్టర్డు కాలేజిద్వారా డిప్లొమా పొందండి.
ప్రాస్పెక్టస్ ఉచితం. వెంటనే వ్రాయండి:
Indian Homoeopathic College,
(APW), JULLUNDUR CITY

మంచి పుస్తకాలు
జీవిత రహస్యాలు:- మీ దాంపత్యసుఖానికి అనేక కామ సూత్రాలు:- ...... రూ. 3-50.
యువతి:- స్త్రీలను గురించి అనేక కుతూహల విషయాలు.......... రూ. 3-50.
సంతానము:- గర్భనిరోధానికి 60 నవీన సులభ మార్గాలు.............. రూ. 3-50.
పోష్టు ఖర్చులు చితం. క్రింది ఎడ్రస్సుకు వ్రాస్తే వి. పి. పోష్టుద్వారా మీయింటికి పంపబడును.
దేశసేవ ప్రచురణలు, ఏలూరు, (ఆంధ్ర)

ఉత్తమ చికిత్స
ఏకారణముల చేతనైనా నరముల బలహీనత చెందినచో వెంటనే 15 నయాపైసల స్టాంపుతో మమ్ములను సంప్రదించండి:
డా. ఎ. పూర్ణచంద్రరావు,
N.D.F.N.F-U. (Ceylon)
పెమ్మసాని ప్రెస్ లైన్సు, నాగేశ్వరరావు పంతులురోడ్,
పూర్ణాపిక్చర్సువద్ద, గాంధినగరం, విజయవాడ-3

వివిధ భారతి
ప్రజానురంజకమైన
ఈ లలిత వినోద కార్యక్రమములో కొన్ని ముఖ్యాంశములు

| | |
|---|---|
| మనోరంజన్ మన్ చాహే గీత్ | మీరు కోరిన అంశములతో కూర్చిన కార్యక్రమము. ఇది ప్రతి దినమూ ప్రసారమౌతుంది. మీ అభిమాన సినీ తారలచేత ప్రతివెలా ఆఖరు ఆదివారమునాడు ఇది ప్రసారం చేయబడుతుంది. |
| చిత్రశాల | ప్రతిదినమూ ప్రసారమయే మాటలతోకూర్చిన కార్యక్రమము. ప్రతిఆదివారము చిత్రరంగములోని ప్రముఖవ్యక్తులతో పరిచయంవుంటుంది. |
| పత్రావళి | శ్రోతల ఉత్తరాలకు జవాబులు. ఈ కార్యక్రమం ప్రతిరోజూ ప్రసారమౌతుంది. |
| పుష్పావళి | ఇటీవలి సినిమా పాటలు ఈ కార్యక్రమంలో ప్రసారమౌతాయి |

ఇతర వివరములకు ఆలిండియా రేడియో వారిచే ప్రచురింపబడే కార్యక్రమ పత్రికలను చూడండి

DA 64/367


# వనితావాణి

## 'ఎదురుచూసిన ఆదివారం'

ఎం. సుగుణగారు రాసిన 'ఎదురుచూసిన ఆదివారం' వ్యాసం నా కెంతో నచ్చింది. గృహిణీమణులను చాలా ఆకర్షించి యుండునని తలస్తాను.

ఆమె రచనలో శైలి బాగుంది. ఒక గృహములో నడచునటువంటిది ఉన్నది ఉన్నట్లు వ్రాసారు.

శ్రీమతి ఆర్. శశిరేఖరావ్ (హంపి)

## చిట్కాలు

16—10—64 పత్రికలో కొంపెల్ల సీతాబాయి గారు వ్రాసిన చిట్కాలు చదివాను. బాగానేవుందిగాని "మామిడి వరుగులను బాగా ఎండబెట్టి మెత్తని పిండిగాచేసుకొని జాగ్రత్త పెట్టుకుంటాము" అని వ్రాశారు. మామిడి వరుగులు ఎంత ఎండబెట్టినా పిండి అవ్వవు అని వారికి తెలియదేమో.

బి. విద్యాసాగరు (మధుర) ★

# దగ్గు మరియు రొంపనుండి
# నిజమైన స్వస్థత పొందుటకు





# సిరోలిన్ వాడండి

దగ్గు లేక రొంపను అశ్రద్ధచేయకండి. సిరోలిన్ వాడి నిరపాయముగా, శీఘ్రముగా నిజమైన స్వస్థత పొందండి. సిరోలిన్ దగ్గును ఆపుటయేకాదు. అది మీ దగ్గుకు మూలకారణమైన హానికరమగు సూక్ష్మ క్రిములను నశింపచేయును; కఫమును నుసను పోగొట్టును. సిరోలిన్ ఎంత కష్టమైన దగ్గునైనను శీఘ్రముగా పోగొట్టి స్వస్థత చేకూర్చును. దాని పనితనమును బట్టియు రుచిని బట్టియు సిరోలిన్ కుటుంబములోని వారి అందరి అభిమాన పాత్రమై యున్నది. పిల్లలకు సిరోలిన్ అంటే ఎంతో ప్రీతి.




మీ యింట్లో సిరోలిన్ తప్పక ఉంచండి

'రోష్' తయారు   సోల్ డిస్ట్రిబ్యూటర్సు: వాల్టాస్ లిమిటెడ్

# రెండవ మలుపు

## పసుపులేటి మల్లికార్జునరావు

కృష్ణా !

ఇది చదివి నువ్వు నన్ను అసహ్యించుకున్నా ఆశీర్వాదంగానే భావిస్తాను.

రెండేళ్లయింది— మన ఇద్దరి మధ్యా ఈ ప్రణయానుబంధం అల్లుకుని. అయినా నా ప్రణయానికి నీ నుండి ఏ అర్థమూ, ఆనందమూ లభించే ఉండలేదు. ఏ దుష్పరిణామాలకు బాధ్యత వహించవలసి వస్తుందో అన్న పిరికితనం చేత, పవిత్రత అన్న పదాన్ని సృష్టించి, నన్ను దూరంగా ఉంచావు. నేనెంత ప్రయత్నించితే, అంత బలమైన అడ్డుగోడలు నిర్మించావు. నీకు తెలుసో, తెలియదో గానీ— స్త్రీలో ఒక పట్టాన రాగ భావాలుదయించవు. కాని దానికి అంకురార్పణ అంటూ జరిగితే అధిక జలపాతం. వరద గోదావరి. ఒక్కోసారి దావాగ్ని, కూడా అయి సర్వనాశనానికి కారణమవుతుంది.

జీవితంలో ఏదో ఉద్యోగం సంపాదించి స్థిరపడే దాకా వివాహోద్దేశ్యమే నీలోలేదని— నీ మాటల వల్లనే తెలుసుకున్నాను. మనం త్వరపడి పెళ్ళాడితే లేనిపోని చిక్కులు కలిగి కష్టాలు పడవలసి వస్తుందనేగా నీ భావం. పిచ్చితనం ! ఆ కష్టసుఖాలను జంటగా భరించినప్పుడూ మధురానందమే !

మధ్య తరగతి కుటుంబీకుడు. . . సంతానంలో కుచేలుడు— పంధొమ్మిదేళ్లు నిండినా నా పెళ్ళి చెయ్యలేని నాన్న నా భారాన్ని వదుల్చుకునేందుకు ఒక రెండవ పెళ్ళివాడితో న పెళ్ళి నిశ్చయించాడు.

నువ్వు మౌనం వహిస్తున్నావు. చూస్తూ వయసు చెల్లిన వాడి భార్యనూ కాలేను. అందుకే నేనొక నిశ్చయం చేసుకున్నాను. లేచిపోవటానికి. ఎవరితో నంటావు. ఎవరయితేనేం— నీలా ప్రతి దానికి గిరిగీసుకునే భయస్థుడు మాత్రం కాదు. నేనంటే పడిచచ్చేవాడు. నేను ఒక్కసారి కన్నెత్తి చూసినా చాలు, అని ఎన్నో వాగ్దానాలు చేసేవ్యక్తి.. తనతో హైదరాబాదు తీసుకు వెళ్ళి పెళ్ళాడతానని అన్నాడు. ఈ రాత్రే ప్రయాణం. ఈ నాటి నుండే మన ప్రేమను మరచిపోవటానికి ప్రయత్నిస్తాను. అందువల్ల నాకేం లాభంలేదు గనక.

నీలో చిత్త సంస్కారం ఉంది. అయినా తగని తగని పిరికితనముంది దాని మారుపేరు మంచితనం, సంస్కారాలేమో అన్పిస్తుంది. కోరికలను బలవంతంగా అణచుకోవటం వల్ల ప్రయోజనం లేదనీ, నీకూ తెలుసు. సాధ్యమైనన్ని కోరికలు తీరుతున్నప్పుడే జీవితాని కర్థమూ, రుచీ కన్పిస్తుంది. లేకపోతే నిస్సారమూ, నిరాశా పూరితమూ అవుతుంది.

నీలోని ఈ బలహీనత మీద కసితో, లేదా నాలోని సుఖాల చాపల్యం వల్ల, నేను ఇలా పోతున్నాను. నువ్వు ఏ కొంచెం గౌరవ మూహించినా నేను లేని ఉండేదాన్నేమో ? అసలు చొరవే ఉన్నట్లయితే ఇదంతా ఎందుకు ?

నీలాంటి వాళ్లు జీవితంలో, అన్ని విధాలా అణగారి పోతారు. మానసికంగా మీరు పసివాళ్లు నా గురించి నాకే బెంగలేదు. . . . నువ్వు క్షణాల్లో నలిగిపోతావు. ఆదే వద్దు క్షణాలను మలుచుకోవటం నేర్చుకో. చప్పగా బతికితే ఈ లోకంలో పుట్టినందుకు సార్థకత ఏమిటి ?

—వసుంధర.

* * •

ఇక్కడికి బదిలీ అయివచ్చాక నకర్షించిన దృశ్యం ఒక్కటే. బడి నుంచి ఇంటికి వచ్చిపోయ్యే దోవలో మూడు మలుపు లున్నాయి. ఎటునుంచి వెళ్లినా మధ్య మలుపులో ఒక పాతకాలపు గడ్డి యిల్లు ఉంది. దానికి రెండు వేపులా ఉన్న అరుగుల మీద ఆరేళ్లు సుమారుగా ఉన్న ఒక పాప తరచు నాకు అవుపిస్తూ ఉంటుంది. పలకమీద ఏదో వ్రాసుకుంటూ, బాలశిక్షలో అక్షరాలు కూడబలుక్కుని చదువుతూనో, లేక పట్టిగానే అరిందాలా కూర్చుని కాళ్ల చుట్టూ చేతులు చుట్టి వచ్చిపోయే వాళ్లను, తన అర్చిప్పలేసి కళ్లతో జిజ్ఞాసువుగా చూస్తూ ఉంటుంది. ఈ దృశ్యానికి నేపథ్య సంగీతంలా, ఆ ఇంట్లో నుంచి బట్టలు కుట్టే మిషను చప్పుడు వినవస్తూంటుంది. చప్పుడును బట్టి చేతి మిషనుగా గ్రహించవచ్చు.

ఆ పాపను మొదటిసారి చూసినప్పుడు— ఎక్కడో చూసిన గుర్తు వచ్చింది. ఎక్కడో మాత్రం ఎంతకూ స్ఫురించలేదు. పెద్దవాళ్ళయితే ఎక్కడో చూశాననుకోవచ్చును. ఆరేళ్ళు నిండని ఈ పాప నాకు ఎక్కడ అగుపించి ఉంటుంది ? ప్రతి రోజూ జ్ఞాపకం తెచ్చుకో ప్రయత్నిస్తూనే ఉన్నాను.

అప్పుడప్పుడూ ఆ ఇంట్లో నుంచి ఒక స్త్రీ కంఠం వినవస్తుండటం తప్ప అంతకు మించి నాకు ఇంటిని గూర్చి కించిత్తు గూడా తెలియదు.

బుధవారం నాడు పిల్లల కాంపోజిషన్ పుస్తకాలను దిద్దుతూ, వాళ్ళురాసిన భావకు నవ్వుకుంటూ కూర్చుంటే, శారద వచ్చి గుర్తు చేసే దాకా టైమే తెలియలేదు. స్కూలుకు పది నిముషాలు ఆలస్యంగా బయల్దేరాను. అక్కడికి రాగానే ఇంటి అరుగు మీద— అనుకున్నట్టే— పాప కనబడలేదు. మమూలు— మిషను చప్పుడు.

స్కూలుకు చేరేసరికి ప్రార్థన ముగిసింది. ఆలస్యంగా వచ్చే పిల్లలు పరుగులతో వస్తున్నారు. పిల్లల రణగొణ ధ్వనులు, ఉపాధ్యాయులు సైలెన్సు అన్న కేకలు— కాస్త సందడిగానే ఉంది. మొదటి పిరియడ్ నాకే క్లాసు లేకపోవటం వల్ల నెమ్మదిగానే వస్తున్నాను. గేటు దాటి లోపలకు వస్తుండగా, ముళ్ళ తీగల వెనకాల పూల మొక్కల గుబుర్ల మధ్య ఎవరో వెక్కివెక్కి ఏడుస్తున్న శబ్దం వినపడింది. ఆగి పరిశీలనగా చూశాను. నన్ను చూసి దడుసుకుని కాబోలు, మాస్టరుగార్ని కావటం వల్ల దెబ్బలు కొట్టడానికే వస్తున్నాననుకుని మరింత వెక్కిపడుతూ ఏడుస్తున్నది.

రోజూ నా కా ఇంటి అరుగుమీద కన్పించే పాప. తను ఈ బళ్ళోనే శిశు తరగతిలో ఉంది. సాధ్యమైనంత మృదువుగా "ఎందుకేడుస్తున్నావమ్మా ?" అనడిగాను.

పెద్దల కోపతాపాలను తెలుసుకునే శక్తి పిల్లల్లో ఉంది. నా కంఠంలో మెత్తదనం గ్రహించి "అమ్మ.. అమ్మ.. కొట్టింది" అన్నది.

"ఎందుకు కొట్టింది?" మరింత లాలనగా అడిగాను.

"మరేమో... నిన్నేమో... జీతం డబ్బులిస్తేనూ సంచిలో వేసుకున్నా... అవేమానే... అవేమానే... ఎక్కడో పడ్డాయి..."

అర్థమయింది. మిషను దగ్గర కత్తిరింపుల్లో మిగిలిన రకరకాల గుడ్డ ముక్కలను అతుకువేసి తయారు చేసిన ఆ రంగు రంగుల సంచి ఏమంత క్రొత్తది కాదు. ఏ మూలనో కుట్లు వూడి, లేదా చిల్లి పడి ఉంటుంది. డబ్బులు జారిపడి ఉంటాయి నిన్నటి జీతం బళ్ళో ఇచ్చావా అని ఇవాళ ఆరాకు వచ్చి ఉంటుంది. ఫలితం దెబ్బలు. లేత చెక్కిళ్ల మీద దెబ్బలు తిన్న ఎరుపుదనం, ఏడ్చి ఉబ్బినట్లున్న కళ్లు దాన్ని స్పష్టం చేస్తున్నాయి.

"మళ్లీ డబ్బు తెచ్చావా?" అనడిగాను.

లేదన్నట్లు అడ్డంగా తలూపింది. "టీచర్ క్లాసులోకి రానివ్వనన్నదా?" అన్నాను.

అవునన్నట్లు తలవూపి చెప్పింది.

ఇంట్లో దెబ్బలు. ఇక్కడికి వస్తే క్లాసుకు రానివ్వక పోవడం బిక్క ముఖంతో ఏడుపుతో దిగులుగా అవుపిస్తున్న పాపను చూస్తే జాలి వేసింది.

"టీచర్‌తో నేను చెప్తాలే రా!" అంటూ చేయి పట్టుకున్నాను. ఉలిక్కి పడింది. అంతలోనే కళ్ల నీరు జలజలా రాలింది. పెద్దగా ఏడవటమే తక్కువ. బహుశా మాస్టరు గార్లు అంత చనువుగా మాట్లాడి ఉండక పోటమే కారణం కావచ్చు. ఉపాధ్యాయులంతా దండించే వారుగానే కోప్పడే వారుగానే ఎక్కువగా పిల్లలకు తెలిసి ఉంటారు. బుజ్జగింపు మాటలు చెప్పి క్లాసుకు తీసుకు వెళ్లటం కాస్త కష్టమే అయింది.

తరగతి గదిలో శ్రీమతి విశాలాక్షి నల్ల బల్ల మీద బొమ్మల వర్ణమాల పెట్టి ఒక్కొక్కళ్ళనే నిల్చోబెట్టి వాటికి ఉచ్చారణలను నేర్పుతున్నది.

నేను లోపలికి రాగానే పిల్లలంతా లేచి నిల్చున్నారు. నవ్వుతూ అయిదో తరగతి మాస్టారు ఈ ఆలోకి వచ్చారే! అంది విశాలాక్షి.

"ఆఁ! ఏంలేదు. పాపను క్లాసుకు రావద్దన్నారుటగదా?" అన్నాను పాప భుజం మీద చేయి వేసి పాప ఎక్కిళ్ళతోనే సిగ్గుపడి తల దించుకుంది.

'రా'వద్దనలేదు. ఫీజు చెల్లించ లేదు. నిన్నడిగితే ఏడుపు మొహం పెట్టింది. పోని యివ్వాళయినా



# మీకు నమ్మకం ఉందా?

సమ్మోహనకరంగా వున్నారు, నిజమే. అందంగా అలంకరించుకున్నారు. చదువులో కూడా మీరు ముందే. కాని మీరు యితరులకు అంగీకారమైన వ్యక్తా?

శరీరంపై దుర్గంధం గొలిపే క్రిములు లేకుండా మీరు చేయలేరు. కాని, క్రమం తప్పకుండా సింథాల్ వాడకంద్వారా వాటిని మీరు తప్పక నిర్మూలించగలరు. మహాద్భుతంగా క్రిముల సంహార కారిణిగా పేరొందిన జి-11* కలిగివున్న సబ్బు ఇండియాలోకెల్లా ఇది ఒక్కటే కోట్లాది వాడి, పరీక్షించి అంగీకరించిన సత్యం. మీ పేరు చాలావరకు దీనిమీదే ఆధారపడి వుండగలదు.

సువాసనగొలిపే సింథాల్ దుర్గంధం గొలిపే క్రిములను సంహరించి, మీ శరీరచ్ఛాయకు వన్నె తెస్తుంది.



సింథాల్ సబ్బుతో స్నానంచేసిన అనంతరం అతి కమ్మని వాసనలీనుతూ, క్రిమి సంహారక గుణం కల జి-11 కలిసివున్న సింథాల్ టాయిలెట్ పౌడర్‌ను వంటిమీద చల్లుకుంటే మరింత రక్షణ.

అందం ఇనుమడింపజేసే సబ్బుమాత్రమేగాక క్రిమి సంహారిణికూడా!




* ఎల్. జివోడా కంపెనీ యొక్క ట్రేడ్ మార్కు.

* "జి-11-ఏమిటి?" అనే ఉచిత సలహా పుస్తకంకోసం 'గోద్రేజ్, బొంబాయి-12'కు వ్రాయండి.

Godrej గోద్రెజ్ సబ్బులలో మేలైన దానిపేరు

CT. 10A. TEL.

## మా సింథాల్ సబ్బు కొనేవారికి ప్రత్యేక సదుపాయం!

సబ్బుపైన చుట్టబడివున్న పల్చని కాగితములోపున డిస్కౌంట్ కూపన్ మీకు కనిపిస్తుంది. ఈ కూపన్‌తో సింథాల్ టాయిలెట్ పౌడర్‌ను మీరు అసలు ధరలో 30 పైసలు తగ్గించి కొనవచ్చు.

వచ్చాక గూడా అదే ఆలోచన.

ఒకటి నాకు బాగా తెలుసు. ఆ పాప పితృవిహీన మరి వేరే దిక్కు లేని తల్లి— తల్లి గాక తండ్రిగూడా అయింది. తన కన్న కడుపు ఆదుని, భవిష్యత్తును తీర్చి దిద్దాలన్న పట్టుదలే నిత్యమూ నేను వినే ఆ విషను చప్పుడు కావచ్చు. తన గర్భంలో తన రక్తమాంసాల్లో భాగమిచ్చి, రూపిచ్చి ఆ నేరానికి ఆ మమతకు, తనలోని ఎన్ని రక్తాంశాలను ఎన్ని స్వేద బిందువులుగా తర్పణమొదిలితే ఆనాపక పావులా సంపాదిస్తుందో. అదేకే ఎరుక, గనుకనే— పాప పావలా పారేసిందని, తన రక్తమే నేల పాలయిందన్న దుఃఖం కోపంగాకా బిడ్డను దెబ్బలు కొట్టి ఉంటుంది. పావులా విలువ ఏమంత ఎక్కువగాక పోవచ్చు. ప్రతి పైసనూ రూపాయిగా ఎంచుకునే పేద కుటుంబాలకు అదే ఎక్కువ. కష్టార్జితం నిరుపయోగంగా పోతే కలిగే బాధ నేనూ అనుభవించాను.. డబ్బు విలువ ఏమిటో గూడా నాకు తెలుసు అందుకు నిదర్శనం నాలుగు రోజుల్నుంచి నా జేబులో కాపురమున్న పావులా. పల్లెటూరాయటం వల్ల, సినిమాలు, హోటళ్ళవంటి ఖర్చులు లేకపోవటం వల్ల — అసలు నేను ఖర్చుకు వెనుకాడే వాడిని కనుక అలాగే ఉంటుంది. మధ్య తరగతిలో పుట్టి పెరిగి, డబ్బు విలువ మీద నిన్నో పాఠాలు నేర్చుకున్న నేను సిగరెట్ కూడా అలవాటు చేసుకునే ధైర్యం చెయ్యలేదు. ఆరోగ్య దృష్ట్యా గాకపోయినా ఆర్థిక దృష్ట్యానే ఎక్కువ భయపడ్డాను. అలా భయపడటమే ఇప్పుడు మంచి దనిపిస్తుంది.

ఆ పావలా పోతకు, ఒక కష్ట జీవి భారంలో వైద్య వంతు తగ్గించటానికి అయినా ఉద్యోగ పడిందన్న సంతృప్తి నా మనస్సుకెంతో హాయినిచ్చింది.

*　　*　　*

మధ్యాహ్నం భోజనానికి వచ్చి భోం చేస్తుండగా బయట ఆడుకుంటున్న చిట్టి తల్లిని ఎవరో అడుగుతుండటం వినబడింది. "అమ్మగారు ఉన్నారా?" అని మరో నిముషంలో చిట్టి తల్లి, గాలిలా పరిగెత్తుకు వచ్చి "గుడ్డలామె వచ్చిందే!" అన్నది తల్లివేపు చూస్తూ.

ఆ చూపు అర్థాన్ని నాకు అందచేస్తూ "మా అమ్మ పంపించిన గుడ్డ పాపకు గౌన్లు కుట్టమని ఇచ్చాను. అడ్వాన్సు కావాలన్నది. మీరేమో పెట్టె తాళం చెతులు జేబులో వేసుకు వెళ్ళారాయెను ఇప్పుడు రమ్మన్నాను!" అంది.

ఆ వచ్చిందెవరో అర్థమయింది. కృష్ణ తల్లి. అయిదు పంటల గడపలేని ఈ ఊళ్ళో ఆమె తప్ప బట్టలు కుట్టే వారెవరూ ఇక్కడ లేరు.

"వెళ్ళి అదేమిటో చూసిరా!" అన్నాను శారద వెళ్ళింది. పెట్టె తెరిచిన చప్పుడు వినబడింది. దాంతో పాటు ఆమె స్వరం వినబడింది. "రెండు గౌన్లు అయ్యాయి. ఇంకొకటి కాగానే మా అమ్మాయితో పంపిస్తాను. మిగతా డబ్బు కూడా..."

"అయ్యాకనే ఇస్తారెండి! శారద కంఠంలో ఏ మార్పూ లేదు."

ఆమె ముఖ కవళికలు, శారద పెదవి విరుపులను చూడాలనిపించింది. ముఖ్యంగా కృష్ణ తల్లి ఎలా ఉంటుందో?.... కాని నేనప్పుడు పీట మీదనుంచి లేచి వెళ్తే శారద ప్రకటించే యుద్ధం, ఓ పట్టాన తట్టుకోవటం కష్టం. ఛ్ఛ్! ఆమె కొంచెం వెనకో ముందో వస్తే ఏం? అసలు నాదొక దరిద్రపు జాతకం. ఏదయినా క్షణాల తేడాల్లోనే తప్పిపోతూ ఉంటుంది.

లోపలికి రాగానే "మిగతా డబ్బియ్యక పోయావా? ఎప్పుడయినా వచ్చేదే గదా?" అన్నాను శారదతో.

మూతి ముప్పయి మూడు వంకర్లు తిప్పి "అన్నట్టే! డబ్బంతా చేతికిస్తే వాళ్ళు పని చేస్తారా ప్రదక్షిణాలు చేయించుకోరూ! అంది.

"అందరలాగే ఉంటారా?

"కొందరయినా ఉంటారుగా!"

"ఆవిడకు నిజంగానే అవసరం ఉందేమో?"

"పాపం ఏమిటమ్మా అంత జాలి?" అనుమానం తగిలినట్లు చూసింది. ఈ మాట్లా అలా కొనసాగితే ఏదో హంగామా జరుగుతుంది. అన్నాను "నీకని మీ పుట్టింటివాళ్ళు పంపారు గానీ, మా చిట్టి తల్లి గౌన్లకు కాదుగా ఆ గుడ్డ!" అని.

"ఇది బావుంది! దానిమీద రాసారా ఏం? అయినా దానికున్న పెన్ని?"

"నీకు మాత్రం ఉన్న పెన్ని?"

ఈ క్రాస్‌కు — గరిట గణగణ లాడిస్తూ "నాకు లేకుంటే ఏమిట. పసిది. ఆడుకునేపిల్ల. పట్టినే మాపుకుంటుంది. ఒకటికి రెండు లేకపోతే వచ్చేది అసలే వానాకాలం" అంది తన ముందు చూపును వ్యక్తపరుస్తూ.

తల్లి అవుతానే తన లోనికి ఈ మాతృత్వపు వాత్సల్యాలను పొందుతున్నది స్త్రీ. లేక ఏ పల్లెటూరో పెరిగి, వానాకాపు బురదలో నడి పుట్టిన శారద కిది ఎవరు చెప్పారు? కృష్ణ యొక్క తల్లిలో ఏదయితే కడుపుతీపి దాగి ఉన్నదో అది శారదలోనూ ఉంది. అందరి తల్లుల్లోనూ ఉంటుంది. శారద—భర్త అనే వ్యక్తితో కష్ట సుఖాలను పంచుకుంటు సాగుతున్న వ్యక్తి. ఆ కృష్ణ తల్లి తన బిడ్డకోసం—అన్నీ అయి, ఒంటిగా— అతి బరువైన బ్రతుకీడుస్తున్న అభాగ్యురాలు

స్కూలుకు వచ్చాను. వస్తూ ఆమె కిచ్చిన అడ్వాన్సు ఎంతని అడిగితే ... అని చెప్పింది శారద. నవ్వు, జాలి ... నన్నావరించింది. ఈ పావలా ఆమె తన పాప ఫీజు కోసమే అడిగి ఉంటుంది.

మొదటి గంట నాలుగవ తరగతి పిల్లలకు సామాన్యశాస్త్రం ఉంది. చెప్పి బెల్ కాగానే స్టాఫ్ రూములోకి వచ్చాను. స్టాఫ్ రూమంటే—ప్రత్యేకంగాలేదు. పెద్ద గదిలో మధ్య స్క్రీన్ స్టాండు అనుపెట్టి అవతల హెడ్మాస్టరుగారికి, ఇవతల ఉపాధ్యాయులంతా కూర్చునేందుకు ఏర్పాటు చేశారు.

ఎవరివో మాటలు వినబడుతున్నాయి. సూర్యావర్ణం మాస్టరు ఒక్కడే ఉన్నాడు. కుతూహలంగా చెవిపెట్టి వింటున్నాడు. నన్నుచూసి వెకిలిగా నవ్వాడు.

"నా కా అభిమానం ఉంది. అడుక్కు తినటం లేదు. నా బిడ్డకు ఫీజు చెల్లించేటంత ఉదారతను నే నాశించను. నా మానాన నన్ను బతకనిస్తే అదే పదివేలు."

"నే చెబుతాను!" హెడ్మాస్టరుగారి స్వరం

తెరలోనుంచి ఒక స్త్రీ ఆకారం మాత్రమే కన్పిస్తున్నది. ముఖం స్పష్టంగా కన్పించటంలేదు. కాగా ఆమె తలమీద కొంగును ముసుగుగా వేసుకున్నది.

ఇంకా ఏవో అన్నది. అదంతా కృష్ణకు నేను ఫీజు చెల్లించినందుకు ఉక్రోషం. తను అడుక్కునే గతికి రాలేదన్న రోషం. ఆమె అటు వెళ్ళంగానే చప్రాసీ వచ్చాడు. హెడ్మాస్టరుగారి పిలుపు. వెళ్తుంటే సూర్యావర్ణం మాస్టరు అన్నాడు. "భలే పట్టావులే గురూ!" అని. నాకేం అర్థం కాలేదు.

"ఏదో మంచివారనుకుంటే—మీరూ ఇట్లా చేస్తున్నారు. మీ పరువు నాకేం బాగాలేదు...." ఈ రీతిగా సాగిన హెడ్మాస్టరుగారి చివాట్లు.

నేను చేసింది తప్పా? ఒకవేళ తప్పే. అయితే దానికింత రాద్ధాంతం దేనికి? ఈసార్నించిలా

41 వ పేజీ చూడండి



"అమ్మా! యిదుగో, మీ పుల్లిపొయ్యి కొబ్బోలు యిక్కడ క్రిందపడింది!"

మిథ్యా లోకమురా
సత్యమైనదీ, నిత్యమైనది
ముక్తి ఫలమేరా—
జీవనమంతా నిద్రే అయితే
జాగృతి ఎప్పుడురా?
మిథ్యలోన బడిపోతే—ముక్తిని
పొందే దెప్పుడురా?
లేరా జీవా! రారా జీవా!
లేచి నిజము గనరా!
ముక్తికి మార్గం కావాలంటే
గురుని మాట వినరా!"

ఆ రాత్రిపూట గుహ ముందర కూర్చుని తంబూరా మీటుతూ పులిబ్రహ్మంగారు పాడుతున్న పాట ఇది. అది తత్వం పాడుతూ ఆశగా అటూ ఇటూ చూస్తున్నది. ఎవరైనా ముక్తికి మార్గం చెప్పమని వస్తారేమో, చెప్పి పుణ్యం గట్టుకుందామని తహతహలాడిపోతున్నది. అయితే అంత రాత్రిపూట జీవరాసులన్నీ నిద్ర పోతున్నా యేమో—ఏదీ రాలేదు. అయినా పులి రాజేమో వాటిని నిద్ర లెమ్మంటున్నది. లేచి రమ్మంటున్నది. ముక్తి మార్గం చెబుతా నంటున్నది. ఏ జీవుడూ రాలేదు. అది వాటి పాపమో, లేక పులిరాజు పాపమో!

......సరిగ్గా మూడు రోజుల క్రిందట ఇదే తత్వం పాడుతున్నది పులి. అప్పుడొక కణితి దాని దగ్గరకువచ్చి "ఏదీ, ముక్తిమార్గం నాకు ఉపదేశిస్తావా?" అని అడిగింది.

"అంతకంటే పుణ్యమా? లోపలికిరా ఉపదేశిస్తాను!" అంటూ గుహ లోపలికి పిలిచింది పులి. కణితిని కళ్ళు మూసుకోమన్నది. దేవుణ్ణి తలచుకోమన్నది. "నీకు ముక్తి కావాలంటే ఇంతకంటే దగ్గరదారి ఇంకొకటిలేదు" అంటూ ఎగిరి దాని గొంతు పట్టుకొన్నది.

"ఆ కణితి పుణ్యమా అంటూ ఈ మూడు రోజులూ హాయిగా గడిచిపోయాయి. దానికి సద్గతులు ప్రాప్తించుగాక!" అనుకున్నది సర్వమంగళం. దాని కిప్పుడు భరింపరాని ఆకలి వేస్తున్నది. తంబూరా లోపల పడవేసి, అప్పటికే శుభ్రంగా చప్పరించి వేసిన ఎముకల్ని మళ్ళీ కొరికి చూచింది. అందులో కండ ఉంటేగదా?......దానికి ఆకలి ఎక్కువై పోతున్నది......మళ్ళీ గుహ ద్వారంవద్దకువచ్చి నిలబడింది.

దూరంగా ఏదో జంతువు తన గుహ వైపే పరుగిడి వస్తున్నది. భేష్!......దాన్ని చమత్కారంగా గుహ లోపలికి ఆహ్వానిస్తే చాలు—దానికి బ్రతుకు బరువు, తనకు ఆకలి బరువు తగ్గిపోతాయి.

ఇంతలో— గ్రద్ద గుహముందరున్న పెద్ద బండ మీద వాలి "పులిరాజుకు శుభము!" అన్నది.

"మిత్రుడా ! కుశలమే కదా ?. . . ఆకలితో ప్రేగులు నకనక లాడి పోతున్నాయి. . . ఆ వచ్చే దెవరు ?" అన్నది పులి.

"ఆ సంగతి విన్నవించుకోడానికే నేను వచ్చాను. అతడు టక్కుటమార నామాంకితుడైన జంబుకోత్తముడు. నీ సహాయం పొందగోరి, నీ దర్శనార్థం వస్తున్నాడు. అతని యెడ ప్రసన్నుడవైతే అతనిద్వారా నీకు మొరచి ఉపాధి ఏర్పడగలదు." అంది గ్రద్ద.

ఇంతలో టక్కుటమారం పులిరాజు ఎదుటకు వచ్చి వినయంగా నిలబడి "దేవరవారికి వందన శతము !" అంటూ అభివాదం చేసింది.

"అతిథి దేవులు ఆసీనులు కావచ్చును. ఏ సీమ వాసులు మీరు ? ఏమి పనిమీద ఇటువచ్చినారు ?" అని అడిగింది సర్వమంగళం ప్రసన్న వదనంతో.

"రాజోత్తమా ! నన్ను టక్కుటమారం అని అంటారు. నేను బంగారుకు అనుంగు సోదరుడను. పెరి కొండల ప్రక్కనున్న కనుమ నా నివాసం." అని తన్ను తాను పరిచయం చేసుకుంది నక్క.

దాన్ని గూర్చి గ్రద్ద మరీ ఘనంగా పరిచయం చేసింది. "అంతేకాదు. ఇతడు గొప్ప ధనవంతుడు. ఇతని వద్ద కత్తి దెబ్బలకైన మొక్కబోనికండపుష్టి గల ఆవులు అయిదున్నాయి. ఒక్కొక్క ఆవు ఒక్క లక్ష అనుకుంటే— ఈ జంబుకేశ్వరుడు అయిదు లక్షలకు అధిపతి !"

పులి అత్యంతానుగ్రహంతో ఇలా అంది. "ఓహో ! ఆనందం ! బ్రహ్మానందం ! ఇంతటి ఘన సంపన్నుని మైత్రి లభించినందుకు మాకెంతో సంతోషంగా ఉంది. ఇట్టి శుభ సమయంలో ఈతనికి రాజ బంధువు అన్న బిరుదమిచ్చి సత్కరించడం ఎంతైన సముచితం !. . ."

"బాగు ! బాగు ! రాజావారి ఔదార్యం కదుం

33 వ పేజీ చూడండి



కేవలం విక్స్ వేపోరబ్ మాత్రమే జలుబు బాధిత ప్రాంతాలు మూడింటి మీద వెంటనే పనిచేస్తుంది...

# రాత్రికిరాత్రే జలుబును తొలగిస్తుంది




విక్స్ వేపోరబ్ తక్షణమే మీకు ఉపశమనాన్ని కలిగిస్తుంది. సులభంగా శ్వాస పీల్చుకొనుటకు...రాత్రంతా హాయిగా నిద్రపోవుటకు మీకు సహాయపడుతుంది...

గొంతునొప్పి, ముక్కునుండి నీరు కారుట, ఛాతీ బిగలాగుట, శ్రమతో శ్వాసపీల్చుకొనుట మొదలయిన మొదటి జలుబు చిహ్నాలు కనపడగానే జలుబు బాధిత ప్రాంతాల మూడింటి మీద...ముక్కు, గొంతూ, ఛాతీల మీద విక్స్ వేపోరబ్‌ను పులమండి. కొద్ది నిముషాలలోనే విక్స్ వేపోరబ్ మీ చర్మాన్ని వెచ్చచేయడం...మీకు ఉపశమనాన్ని కలిగించడం మీరు గమనిస్తారు. నివారణగలిగించే వేపోరబ్ ఆవిరితెరలు ముక్కు మరియు ఛాతీలలోని కఫాన్ని త్వరగా విడలగొట్టి మీ గొంతునొప్పిని తగ్గిస్తాయి.

విక్స్ వేపోరబ్ జలుబుతో రెండు విధాలుగా పోరాడుతుంది. రాత్రంతా మీరు సుఖంగా నిద్రించే సమయంలో యీ అద్భుతమైన ద్వివిధ చర్య కొనసాగుతూ ఉంటుంది. ఉదయానికల్లా మీ అతి పెద్ద జలుబు కూడా పూర్తిగా పోయి మీరు సంతోషంగాను, ఆరోగ్యంగాను వుంటారు

నిద్రపోయే సమయంలో విక్స్ వేపోరబ్‌ను జలుబు బాధిత ప్రాంతాల మీద పులమండి...




## విక్స్ వేపోరబ్ యొక్క అద్భుతమైన ద్వివిధ చర్య



వెలుపలి చర్య: చర్మమును వేడిపరచే వేపోరబ్ యొక్క చర్య మీకు తక్షణమే ఉపశమనమును గలిగించును. వేపోరబ్ యొక్క గుణకరమైన ఔషధములు చర్మము మీద పనిచేసి బిగలాగిన ఛాతీ మరియు వీపును సడలించును. కండరముల నొప్పిని తొలగించును.



లోపలి చర్య: మీ శరీరపు వేడే వేపోరబ్‌ను త్వరగా ఔషధపు ఆవిరి తెరలుగా మార్చును. ఈ ఆవిరి తెరలను ప్రతి శ్వాసతో రాత్రి పొడవునా మీరు లోపలికి పీలుస్తారు. యీ లోపలి చర్య ముక్కులోనూ ఛాతీలోనూ వున్న కఫమును తొలగించును...గొంతునొప్పిని ఉపశమింప జేయును.

తీవ్రమైన జలుబులకు, ఆవిరినుండి లేచి వచ్చే విక్స్ వేపోరబ్ ఔషధపు ఆవిరి తెరలను పీల్చండి




# విక్స్ వేపోరబ్

3 సైజులలో




### జ రి గి న క థ

విభిన్న మనస్తత్వాలు గల ఐదుగురమ్మాయిల తండ్రి రామయ్యగారు. ఆయన స్నేహితుని కొడుకు సుధాకర్ మద్రాస్ చూడ్డానికొచ్చి కళను ప్రేమిస్తాడు. పెద్దలంతా కళను వాళ్ళ బావ శేఖర్‌కిచ్చి వివాహం చేయాలనే సంకల్పంతో ఉంటారు. అందుకు భిన్నంగా శేఖర్ శారదచే ఆకర్షింపబడ్డాడు. శేఖర్‌తో సినిమా కెళ్ళిన కళను సుధాకర్ స్నేహితుడు మోహన్ చూసి బయటికెళ్ళిపోతాడు. మోహన్ సుధాకర్ విషయాలేవైనా చెప్తాడేమో తెల్సుకోవచ్చనుకున్న కళ చాలా నిరుత్సాహపడుతుంది. కళ సుధాకర్‌ను మరచిపోయిందని భావించి మోహన్ చాలా బాధపడ్డాడు. వైజాగ్ నుంచి తిరిగి వచ్చి గీతని కల్సుకుంటాడు.

(గత సంచిక తరువాయి)

మోహన్‌కు కాఫీ కప్పు అందిస్తూ గీత అడిగింది—

"కొత్త సినీరథం తెచ్చిస్తారని మాట్లాడకుండా వూరుకున్నారేం ?"

"ఆ పత్రిక్కి అంత్యక్రియలు కూడా జరిగాయి.... ఇంకనేనేం తేనూ ?" అన్నాడు మోహన్ కప్పు పెదాల దగ్గర ఉంచుకుంటూ.

గీత అర్థంకానట్టు చూసింది.

"జనన మరణ సంచికలు రెండూ ఆ ఒక్క సంచికేనండీ. రథం కదలటం మానేసింది...."

గీత బుగ్గలు సొట్టలు పడ్డాయి.

"పాఠకుల నందరినీ ఏప్రిల్‌ఫూల్ చేసిందన్న మాట ! .... పాపం ! మీ ప్రయాసంతా వృథా ! అలాంటి చచ్చు పత్రికలో ఫోటో వేయించుకున్నారు కదా ? ఎవరు చూస్తారని ?"

మోహన్ ఆమాట వప్పుకోలేదు.

"ఎందుకు చూడరు ? సినిమాలన్నా, సినిమా పత్రికలన్నా వెర్రిలేనివాళ్ళెవరు ఈ రోజుల్లో ?"

మోహన్ కాఫీ త్రాగేసి కప్పు క్రింద పెట్టాడు.

"అందుకే నేమిటి ? అంతా కలిసి సినీరథానికి సమాధి కట్టారు !—" అంటూ గీత పకపక లాడింది.

మోహన్ తెల్లబోయాడు. ఆడవాళ్ళ మాటల్లో తెలివి తక్కువ, తికమక ఎక్కువ !

"మీకు తెలీదండి ! ఆంధ్రుల్లో ఒకరు పుస్తకం కొంటే అది పదిమంది పుచ్చుకు చదువుతారు.... సినీరథం పెట్టినతను నాకు పరిచయస్థుడు. అయినా ఫోటో వూరికే వేసుకోలేదులెండి .... నాకు తప్పకుండా ఛాన్సు వస్తుందని నా అంతరాత్మ చెబుతున్నది .... కొన్నాళ్ళాగి చూద్దాం !" అంటూ మోహన్ కుర్చీలోనుంచి లేచాడు. గీత గేటు వరకు వెళ్ళి సాగనంపి వచ్చింది.

*　　*　　*

ఉష బస్సుస్టాపులో నిలబడిఉంది. మరో ఇద్దరు కాస్త దూరంలో వెనకాతలి గోడ కానుకుని మాట్లాడుకుంటున్నారు.

"హలో ఉషా ! ఎక్కడికో ప్రయాణం కట్టారే ?"

ప్రభాకర్ పంట్లాం జేబులో చెయ్యిదూర్చి నవ్వుతూ దగ్గర కొచ్చాడు.

"మా స్నేహితురాలింటికి .... ఇదే మొదటిసారి వాళ్ళింటికి వెళ్ళటం. ఎక్కడ ఉందో ఏమో వెళ్ళి వెతుక్కోవాలి. మీరు కాస్త దిగబెట్టి వెళ్తా రంటే ఎంతైనా పుణ్యం ఉంటుంది ...."

"వాళ్ళిల్లు ఎక్కడుంది ?"

ఉష చెప్పింది.

"ఆ లొకాల్టీ సరిగా నాకూ తెలీదు. అయినా మీకు తోడు రమ్మంటే వస్తాను .... అక్కడికి వెళ్ళి నాలుగు వీధులు తిరిగితే అదే తెలుస్తుంది...." అన్నాడు ప్రభాకర్ జేబులో నుంచి పేపర్ ఇవతలకు తీస్తూ.

"వార్తలేమిటి ?" అనడిగింది ఉష.

"బ్రహ్మాండమైన వార్త. ఆ వార్త చెప్పాలనే మీ దగ్గరికి పరిగెత్తుకొచ్చాను." అన్నాడు ప్రభాకర్ పేపరు పూర్తిగా తెరిచి రెండు చేతులతో పట్టుకుంటూ.

"మీరు పేపరు చదువుతారంటే నేను నమ్ముతా ననుకోకండి !" అంటూ ఉష హేళన చేసింది.

"రోజూ చూస్తాను ఉషారాణీ ! ఎంతమాటన్నారు ! 'వాంటెడ్', 'మాట్రిమోనియల్' కాలమ్స్ మట్టుకే అనుకోకండి....."

ఉష ముఖం ఎర్రబడింది.

"మాట్రిమోనియల్ కాలమ్ వూరికే చూడ్డమేనా ? జవాబులు కూడా రాస్తారా ?"



ప్రభాకర్ గాభరాగా పేపరు సగానికి మడిచి పట్టుకున్నాడు.

"మీకు బొత్తిగా అనుమానం !.... చదవటానికి తమాషాగా ఉంటాయి ... 'వంట, కుట్టు, వీణ వచ్చిన వధువు కావలెను ....'"

ఉష నవ్వింది. ప్రభాకర్ తేలికపడ్డాడు.

# అయిదు రెళ్ళు

"మీరు కిలకిలా నవ్వుతున్నారు. నేనూ అందుకే చదువుతానంటే నమ్మరుకదా !"

మనిషికి తిండి, బట్ట ముఖ్యం. తర్వాత వినోదం కావాలి. పెళ్ళానికి వంట రాకపోతే వంటమనిషిని జీతమిచ్చి పెట్టుకోవాలి. కుట్టు వస్తే టైలరు ఖర్చు మిగులుతుంది. పోతే వీణ సరదాగా ఉన్నప్పుడు అతనికి వినోదం ! మగవాళ్ళు ఎంత గడుసువాళ్ళు !

"మీ మగాళ్ళు ఎంత గడుసువాళ్ళండీ ! చివరికి టైలరు ఖర్చు కూడా లేకుండా ఎంతెత్తు వేశారో చూశారా ?" అంది ఉష ప్రభాకర్‌ను దెప్పుతున్నట్టుగా.

ప్రభాకర్ చిలిపిగా నవ్వాడు.

"అతని సంగతి అలా ఉంచండి. మీరు కుట్టిన షర్టులు, పంట్లాములు వేసుకుంటే నాకు పిలిచి ఉద్యోగం యిస్తారు ...."

"అదేమిటి ?" అంది ఉష ఆశ్చర్యంగా.

"సర్కసులో బఫూన్ ఉద్యోగం !"

ఉష మూతి ముడిచింది. ఇంతలో బస్సు వచ్చి ఆగింది. ఇద్దరూ గబగబా లోపలికి చొరబడ్డారు. డబుల్ సీట్లో కిటికీ పక్కన ఉష కూర్చున్నది. ఉష పక్కనే ప్రభాకర్ కూర్చున్నాడు. రష్ ఎక్కువైతే ఆ పక్కసీట్లు, ఈ పక్కసీట్ల మధ్య చోటు చూసుకునేవారిలో కొంతమంది బస్సు కుదుపులకు మీద వాలితే కిమ్మనకుండా వారి బరువును మోయాలి పాపం ! ప్రభాకర్ !

మెల్లిగా బస్సు నిండిపోయింది.

ఏ స్టాపింగులో దిగాలో తెలియదు కాబట్టి కండక్టరును కనుక్కోమంది ఉష.

ఇటు చూసేటప్పటికి కండక్టరు కనిపించాడు. ప్రభాకర్ టక్కున అడిగాడు. అతడు తెల్లబోతూ "నాకు .... తెలీదు...." అని చెప్పాడు తడబడుతూ.

ఉష నోటికి పమిటచెంగు అడ్డంపెట్టుకుని నవ్వింది. ప్రభాకర్ చిరాకుపడ్డాడు ఉష నవ్వినందుకు, కండక్టరుగాడికి ఏమీ తెలీనందుకు.

"కాకీబట్టలు కట్టుకున్నవాళ్ళంతా కండక్టర్లేనా మరి ?" అని మళ్ళా నవ్వింది ఉష.

ప్రభాకర్ మొదట తెల్లబోయాడు. తర్వాత తనూ నవ్వాడు. కాకీబట్టలు వేసుకున్నవాడు ముందరి వరుసల్లోని ఒక సీటులో కూర్చుని ఉన్నాడు ! ఇంతలో నిజం కండక్టరు కాకీ బట్టలు, మెడలో పెద్ద తోలుసంచి, చేతిలో టిక్కెట్లతో దగ్గరకు రానే వచ్చాడు. ప్రభాకర్ కండక్టరును ఎంక్వయిరీ చేసి రెండు టిక్కెట్లు తీసుకున్నాడు.

ఉన్నట్టుండి ఉష అడిగింది: "ఇందాక ఏదో వార్త అన్నారు ?" అని.

ప్రభాకర్ మళ్ళా పంట్లాం జేబులోనుంచి పేపరు తియబోయాడు. ఉష చేత్తో వారించింది.

"చెప్పండి చాలు !"

ప్రభాకర్ మొదలుపెట్టాడు.

"ఇన్నాళ్ళూ ఎస్ట్రాలజీ అంటే ఏదో పనికిరాని సబ్జక్టు అనుకున్నాను సుమండీ ! మీరు పామిస్ట్రీలో ఇంటరెస్టు కలిగించాక చూద్దును కదా, ఎంత మజాగా ఉందనుకున్నారు ! శ్రమ పడక్కర్లేదు. బోలెడంత గడించుకోవచ్చు ...."

"సైడ్ బిజినెస్ పెట్టాలనుకుంటున్నారా ?" ప్రభాకర్ నిట్టూర్చాడు.

"ఎం. బి. బి. ఎస్. లో చేరకముందైనా చెప్పారు కాదు. మూడోఏడు దాటలేక రెండేళ్ళబట్టి అవస్థపడుతున్నాను..... ఇంతకీ అసలు విషయం చెప్పటం


నల్లులను చంపును
ఏ.జీస్
బగ్సేలిన్-20
సాగ్‌సన్స్ కెమికల్ కో., మద్రాసు-21.





విజయకుమారి సౌందర్య రహస్యం

"నా చర్మసౌందర్యం కోసం రోజూ లక్స్ వాడుచున్నాను"

లక్స్ టాయిలెట్ సబ్బు సినీమాతారలకు సౌందర్యమునిచ్చే సబ్బు




తెలుపులోను, నాలుగు వావెన్నెల రంగులలోను వున్నది

LTS. 177-73 TL

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

తున్న వళానికి వేదాంతిలా మెరిసిపోయే జనార్ధన రావ్ వాల్తేరు స్టేషన్లో కనుపించేడు. పూరీ వెళ్ళే ప్రయాణాన్ని వాయిదా వేసి అక్కడ దిగి పోయేడు చలం. జనార్ధనరావ్‌తో పాటు అతని గదికి వెళ్ళేడు.

గదిలో కూర్చున్న తర్వాత వాళ్ళిద్దరి మధ్యా అతి భయంకరమైన సంభాషణ జరిగింది. దాన్లో ముఖ్యమైన కొన్ని మాటల్ని ఇక్కడ వ్రాయడం అవసరం. జనార్ధనరావ్ అడిగేడు—

“లేదు గుర్తు కొస్తుందేమిటాని బాధగావుంది.”

“దాన్ని మరచి పోవటానికి ప్రయత్నం చెయ్యగూడదూ?”

“చాతగావడం లేదు. రెండుసార్లు కృష్ణలో దూకి చావాలనుకున్నాను. చివరికి చావలేక పోయాను.”

“చచ్చేం సాధిస్తారు?”

“బ్రతికేం చేయగలను?!”

“పిచ్చి.”

“కాదు. నిజం.”

“ఎందుకు?”

“కేవలం ఒక ఆడ పిల్ల గురించి—”

“కాదు. నా జీవితానికి వెలుగునిచ్చే ఓ జ్యోతి గురించి అనండి”

“నిజం చెప్తున్నావ్ బ్రదర్! మనిద్దరం ఒకే పడవ ఎక్కాం” అనుకున్నాడు జనార్ధనరావ్.

“చూడండి! నేను చాలా అందమైన కుర్రాణ్ని. ఈ రెండు నెలల్లో నేనెంత మారి పోయానో గమనించారా? తలుచుకుంటే జాలి కలుగుతోంది.



నాయనా... అన్నాడు చలం.

"వరలక్ష్మి మీకిప్పుడు కనిపిస్తే?"

"ఎక్కడుంది?"

"చూడాలని ఉందా?"

"కాదు చంపాలని ఉంది."

"నిజంగా చంపగలరా?"

"అంతకంటే వేరే మార్గమూ లేదు. ఈ జ్ఞాపకాల వలనుంచి నేను తప్పుకోవాలంటే— వర లక్ష్మిని, ఆమె భర్తని చంపి నేనూ చావాలి. అంతే."

"నమ్మొచ్చునా?"

"ఏం— మీకు మాత్రం చంపాలని లేదా?"

"చంపగలను. కానీ దాని వల్ల నేను చావకూడదు."

"ఏం."

"నే నిప్పుడు ప్రయోజకుడను కావాలని ఉంది. ప్రయోజకుడ్నయిన తర్వాత నన్నేడిపించిన జనాన్ని కష్టించాలని ఉంది. నేను నవ్వుతూ వాళ్లని ఏడిపించా లని ఉంది. అందుచేత నేను చావకూడదు."

"అయితే వరలక్ష్మి వాళ్లమీద మీ పగ ఎప్పటికి చల్లారుతుంది ?"

"వరం మీదేకాదు—నాకు చాలామంది మీద ఉంది పగ. అప్పుడే అందర్నీ పేరుపేరున చంపడానికి నాకు శక్తి లేదు. చట్టం అంతవరకూ ఊరుకోదు."

జనార్ధనరావ్ నడుం వాల్చేడు. కాలుమీద కాలు వేసుకోవాలనే కోరిక కలిగింది. నవ్వేస్తూ అన్నాడు—

"రాజులా బ్రతికేవాడిని. దేవుడు నాకు కీడు చేశాడు. ఓ కాలు తీసేశాడు."

చలం ఏమీ మాటాడలేదు. మళ్లా జనార్ధనరావే అడిగేడు—

"అవునూ! మీరు వరాన్నీ, దాని మొగుణ్నీ చంపుతా నన్నారే—దానికి మీ ప్లానేమి టసలు ?"

"వినాలని ఉందా ?"

"అవును."

"ఏంలేదు. ముందు వరలక్ష్మి భర్తని మంచి చేసుకుంటాను. మంచితో విషం తినిపించవొచ్చుట."

"మీ దగ్గర విషం ఉందా ?"

"లేదు."

అప్పటిగ్గాని జనార్ధనరావ్ బైటపడలేదు.

"నా దగ్గరుంది. దాచిపెట్టాను. అవుతే ఎల్లా ఉపయోగించాలో తెలీక వాయిదాలు వేస్తున్నాను. మీకు తెలిదేమో—నేనీమధ్య అతి దారుణంగా మారి పోయేను. రాక్షసుడ్నవుతున్నాను."

"లేదు. మీరు కాలేరు. మీలో భయం చావలే దింకా. నా విషయం వేరు. నే నన్నింటికీ తెగించేను. ఏమైనా చేస్తాను. ఏదీ, ఆ విషం ఇలా ఇవ్వండి. ప్రయోగించి పీడ వొదిలించుకుంటాను."

"వరలక్ష్మి యిక్కడ లేదు. కాకినాడలో ఉంది."

"పర్వాలేదు. తెల్లవారుయం తిరుగు బండిలో కాకి నాడే వెడతాను."

"నిజమా ?"

"నిజం."

"అయితే సరి. ఈ రాత్రికి కమ్మగా నిద్రపోండి."

చలం నిద్రపోలేదు. అంతమాత్రంచేత మేలు కుని జనార్ధనరావ్‌ని ప్రశ్నల్తో వేధించనూ లేదు. చేయబోయే కార్యక్రమాన్ని వూహించు కుంటున్నాడు.

జనార్ధనరావూ నిద్రపోలేదు. వరలక్ష్మి మీద మనసు పోయింది, కుంటి కుర్రాడిమీద జాలి చూపిం చిన వరలక్ష్మి, దిక్కులేని ఓ వ్యక్తితో కబుర్లు చెప్ప టాలు నేర్పిన వరలక్ష్మి, ఎవరూ లేరనుకునే తన లాంటి దౌర్భాగ్యునికి అన్నీ నేనే నవిపించేటంత వర లక్ష్మి—ఇకముందుండదు. ఉండనీడు చలం.

* * *

జ్ఞాపకానికి నిలిచేవి కొన్ని. దాన్లో రెండు రకాలు. బాధ కలిగించేవీ, సుఖాన్నిచ్చేవీను. మొదటి రకాన్ని సొంతం చేసుకున్న మనిషి నూటికి నూరుపాళ్ళ దురదృష్టవంతుడు. అనుక్షణం వాటిని మరిచి పోవాలనే తపన, ప్రయత్నమూ ఫలించక నలిగిపోడ మనేది సిసలైన చిత్రవధ. అవునా ?

జవాబు అవునని వొస్తే జనార్ధనరావ్ గురించి అప్పుడే కొంత చెప్పడం జరిగిందన్నమాట. జనార్ధన రావ్‌కి కోరికలెన్నో లేవు. ఉన్న కొన్నింటిలోనూ వరలక్ష్మిని పెళ్లాడాలనేది మొదటిదీ, ముఖ్య మైనదీని.

తల్లిదండ్రులు లేరతనికి. వాళ్ల మావయ్య అతన్ని పెంచేడు. లోకానికి తెలిసిందీ, తను గట్టిగా నమ్మేదీ దేన్లోనూ ఒకటి కాలేకపోయినా— తన వెనకనున్న కొద్ది ఆస్తినీ చేతుల్లో పెట్టుకున్న తర్వాత గానీ మావయ్య తన పెంపకపు బాధ్యత తీసుకోలేదనేది మాత్రం రెండు పక్షాలూ వొప్పు కున్నాయి.

మావయ్యకి పిల్లలు చాలామంది ఉన్నారు. వాళ్లంద ర్లోనూ వరలక్ష్మిపైనే జనార్ధనరావ్‌కి అభిమానం. ఎందుచేతనంటే—కారణం ఎదటివాడికి నచ్చినా నచ్చ కున్నా తను గట్టిగా నిజమని భావిస్తున్న మాట 'వర లక్ష్మి ఆ యింట్లో తప్పబుట్టిం దనేది.' అమ్మ ఎలాం టిదో తనకి తెలీదు. వరలక్ష్మికి అమ్మపోలిక లొచ్చా యని తెలీడంతో అత ప్పొంగిపోయేవాడు.

అతను థర్డ్ ఫారం చదువుకునే రోజుల్లో వర లక్ష్మి చాలా చిన్నపిల్ల. 'ఓమాటు ఆ అమ్మాయికి పెద్ద జ్వరం వచ్చింది. ఎన్నో మందులు వాడేరు. తగ్గే సూచనలేవీ కనుపించలేదు. జనార్ధనరావ్‌కి భయం వేసింది. తనతో నేస్తం గట్టే పిల్ల, మనసు విప్పుకు హాయిగా మాట్లాడే అందాల భరిణ, రేపు దూరమై పోతే తన బ్రతుకేంగాను ? ఇంక, ఆ యింట్లో మాటాడేందుకు ఏ పక్షి సిద్ధపడుతుంది ?

చెరువుగట్టు గంగాణమ్మ గుడికి వెళ్లి ఆమెకు మొక్కుకున్నాడు. వరలక్ష్మి జ్వరం నయమైతే అయిదు రూపాయలు ముట్టచెప్పుకుంటాను అమ్మ తాని. ఏదేం చిత్రమో గాని, రెండోరోజుకే వర లక్ష్మి జ్వరం తగ్గిపోయింది. మరి కొద్ది రోజుల్లో ఆపిల్ల మంచం దిగి ఆడుకోడం ప్రారంభించింది.

గంగాణమ్మకి అయిదు రూపాయలు బాకీ పడిన సంగతి గుర్తొచ్చినప్పుడల్లా అతను వొణికిపోయే వాడు. తీర్చడానికి డబ్బులేవి ? అడిచి గీపెట్టినా కాణీ గూడా యిచ్చేవాడు కాదు మావయ్య.

ఓ రోజు—అదృష్టవశాత్తు వాళ్ల క్లాసువాళ్లంతా పక్క వూరికి విహారయాత్రకి వెళ్లాలని తీర్మానించు కోడం జరిగింది. తలో అయిదు రూపాయలు తెచ్చు కోమని మాష్టారు చెప్పేరు. మావయ్యని అడిగేడు ముందు ఇవ్వనన్నాడే గానీ, ప్రయాణమనగా— ఏ పురుగు కుట్టిందో గాని అయిదు రూపాయిలూ యిచ్చేడు. చేతిలో డబ్బు కనిపించగానే అతని మనసు విహారయాత్రమీదకి పోయింది. తాత్కాలికంగా గంగాణమ్మ బాకీ విషయం మరిచిపోయేడు. కానీ— ఆవేళ ఉదయాన్నే పెద్ద జ్వరమొచ్చిందు. అనొక్కడూ చీలిపోయి గుడి దగ్గరికి వొచ్చి ఆ దేవత బాకీ తీర్చేడు. చేతిలో దమ్మిడీ లేదు. ఇంటికి వెడితే చివాట్లు తప్పవు. అందుచేత ఆ రాత్రంతా ఉపోషనంగా ఆ గుడిలోనే ఉండిపోయేడు.

ఇది చిన్నతనంలో కేవలం వరలక్ష్మికోసరం చేసిన ఒకానొక మహత్తరమైన త్యాగానికి ఉదాహరణ. పసిపిల్లది పగబట్టినట్టు జీవితమనే ధైర్యం భయ పెడితే చెదిరిపోయేంత పిరికివాడు గానీ, తోటి మనుషులు ఏడ్చినా చెప్తే సహించేటంత మంచి వాడు మాత్రం కాదు.

కుంటివాడు ఎందుకూ పనికిరాని వెధవని ఏ శాస్త్రంలో నైనా రాసిఉందా ? కుంటివాడే జనార్ధనరావ్ ! అందరి పిల్లల్లా చెక్కుళ్ళ ఆడుకునే అదృష్టాన్ని నోచుకోలేదతను. అయితే అంతమాత్రం చేత వీళ్లందరూ కలిసి తనని గేలి చేసేయడమేనా ? వాళ్లకి రెండు కాళ్ళూ నిక్షేపంగా ఉన్నాయి. గనక ఆడుతున్నారు. తలొక్కరికీ ఒకే కాలు వొస్తేనంటే తెలిసొచ్చేది. వాళ్ళ చెడుగుడు ఆడేవాళ్లు, పరుగు పందేలు వేసుకునేవారు. కేరింతాలు కొట్టేవాళ్ళు. ఎప్పుడూ తనని వెక్కిరించేవారేగాదు.

అలాంటి సమయంలో వరలక్ష్మి గనక తన జత లేకపోతే ఏంగాను ? చిన్నప్పుడే ఆత్మహత్య చేసుకు నుండేవాడు. బైట కుర్రాళ్ల తనంటే గిట్టక యాగీ చేసేవారు. మావయ్య సంతానానికేమొచ్చె తెగులు ? వాళ్ల నోరు పారేసుకోడమేనా ?

నిజమే—తనకీ వాళ్లందరితో ఆడుకోవాలనీ, వాళ్లలా గెంతులేయాలనీ మనసులో పీకుతూనే ఉంటుంది. ఒకపక్క కెలుకుతున్నా ఈ బాధకి తోడు వాళ్ల ఈసడింపులు గూడానా ?

తల్లీ తండ్రి లేకపోడమే ఒక పెద్ద లోపం. అది చాలదన్నట్టు ఈ అంగవైకల్య మొకటి నరనరాల్లో నీరసం, నెత్తుర్లో నిస్సత్తువ నింపేసింది.

వరలక్ష్మి అనబడే వరాలమూటే గనక తనకి దొరక్కపోతే ?—

అందుకే అతనికి వరలక్ష్మిమీద అంత అభిమానం. అందుకే ఎన్నో పరీక్షల్ని గూడా లెక్కచేయకుండా రెక్కలు కట్టుకు యింటిదగ్గర వొచ్చి 'నువ్వే నాకు కావాలి వరం! నన్నొదిలి వెళ్లకు!' అని ప్రాధేయ పడ్డాడు.

వరలక్ష్మి నిర్లక్ష్యం చేసింది. అంత నిర్లక్ష్యాన్ని యిన్నేళ్లు దాచుకున్నదో లేక పెంచుకున్నదో తెలీదు గాని రాక్షసిలా వికృతంగా, దెయ్యంలా కటువుగా అన్నది. 'నువ్వు కుంటివాడివి బావా ! అదే నాకు నచ్చనిది' అని.

ఇది తలుచుకుంటూన్న కుంటి జనార్ధనరావ్ కళ్లల్లో నీళ్లు తిరిగేయి.

పరీక్షలయిపోయిందు మావయ్య ఉత్తరం రాసేడు. వరలక్ష్మిని ఓ లక్షాధికారి పెళ్లాడబోతూనాట్ట. లక్షాధికారి'. 'మావయ్యా ! నువ్వు మొదట్నుంచీనా బ్రతుకు తింటున్నావు సుమా !' అనుకున్నాడు. ఉత్తరం చదివి. ఆడపిల్లని, అందునా కన్న కూతు రిని తనవేపు తిప్పుకోడం, తన మాటకి లొంగదీసు కోడం మావయ్యలాటి పెంపుడుభావానికి చాతకాని దేమీ కాదని భావించాడేగానీ—'అతి సున్నితంగా గొంతులుకోసే నేర్పరురాలు వరలక్ష్మి' అని యిక్కడి కొచ్చిన తర్వాతనే తెలిసింది.

## అజీర్ణము
## వల్ల ఎందుకు
## బాధ పడతారు?

# హ్యూలెట్స్ మిక్స్చర్

## వాడి త్వరగా నివారణను పొందండి

ఎడతెరిపిలేని పని మరియు చింత జీర్ణశక్తిని చెడగొట్టి ఆకలిని పోగొట్టి మంద కొడితనాన్ని కలిగిస్తాయి. హ్యూలెట్స్ మిక్స్చర్ అతిత్వరగా చిర నివారణను కలిగించును. కడుపులో ఇది రక్షణపూతగా ఏర్పడుతుంది. బాధ కలిగించే ఆమ్ల రసములను సరిపరచి తిన్న ఆహారము జీర్ణించుటకు ఉపకరించును. హూలెట్స్ మిక్స్చర్ చంటిపిల్లల జీర్ణాశయ రోగములకు కూడా మంచిది. విరేచనములకు నల్లమందు కలిసిన హూలెట్స్ మిక్స్చర్‌ను వాడండి.

**హ్యూలెట్స్ మిక్స్చర్ జీర్ణశక్తికి ఉపకరించును.**




**C. J. హ్యూలెట్ & సన్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్ 86/A నయనియప్ప నాయక్ స్ట్రీటు, మద్రాసు-3**

JWT/CIH 2820 A

# మనిషి పగ

న్నాడు. తన ముందున్న గ్లాసుల్ని ముగ్గురికి ఎంచి వట్టు పంచాడు.

'మీ పెళ్ళిరోజు వచ్చాను. అర్జంటు పనివల్ల మాటాడేందుకు వీలుచిక్కక వెంటనే తిరిగి వెళ్ళిపోయేను. ఈ పూట్లో మిమ్మల్ని చూచి నేనెంత ఆనందిస్తున్నానో చెప్పలేను.' లోన అనుకుంటూ గ్లాసుల్లో ద్రాక్షరసం పోసేడు.

'తాగండి, నా సంతోషానికి చిహ్నంగా ఈ పానీయాన్ని సమర్పించుకుంటున్నాను.' అని ఇంగ్లీషు లోనూ అనుకున్నాడు.

తర్వాత ఒకొక్కడూ ఆ మూడు గ్లాసులూ పూర్తి చేశాడు.

'ఇప్పుడు మనం తాగినదాంట్లో జనార్దనరావిచ్చిన విషం కలపలేదు గనక మన ముగ్గురికీ చావు లేదు. ముగ్గురం కలిసికట్టుగా చచ్చేరోజు అతి త్వరలో వస్తుందని ఆశిస్తున్నాను మిస్టర్ అండ్ మిసెస్ సుధాకరం'

చలం సిగరెట్టు ముట్టించేడు. పక్కమీద పడుక్కున్నాడు. అయినా విశ్రాంతి తీసుకోవాలనే ఉద్దేశానికి తావివ్వలేదతను. ప్రయాణం తాలూకు బడలిక తీరనూలేదు. ఇంకా మగతగానూ ఉంది.

సరిగ్గా మూడు గంటలకి ఆ హోటల్లోంచి బైటికొచ్చేడు. జనార్దనరావ్ ఇచ్చిన అడ్రస్సు పుచ్చుకుని కాకినాడ వీధుల వెంట నడవడం ప్రారంభించేడు.

మరో గంటకి అతను వాళ్ళిల్లు కనుక్కున్నాడు. వాళ్ళిల్లు చాలా బావుంది. ఇల్లు అనే దానికంటె చక్కని భవనమని చెప్పడం మంచిది. ఆవరణలో కాలుపెడుతూండగా పూల మొక్కల్లోంచి వచ్చేగాలి మనసుకి పరవశం కలిగించింది. అక్కడే, ఆ మొక్కల దగ్గరే పచ్చగడ్డి మీద కాసేపు కూర్చుంటే ఎంత బాగుంటుందీ అనుకున్నాడు. ఇంత శ్రద్ధ తీసుకుని ఆ మొక్కల్ని నాటించింది వరలక్ష్మి అయి ఉంటుంది.

అతను కాలింగ్ బెల్లుమీద చేయుంచేడు. మరో క్షణంలో తొమ్మిదేళ్ళ కుర్రాడు ముక్కు తుడుచుకుంటూ తలుపు తీసేడు.

"ఎవరు కావాలి ?"

".. .. .."

"మా నాన్నగారు క్యాంప్ కెళ్ళేరు, లేరు."

"సుధాకరం—"

"రండి. లోపలికి రండి. అమ్మా ! బాబాయి కోసం ఎవరో వచ్చారే ?" అంటూ వాడు అక్కడే ఉన్న మరో గదిలోకి వెళ్ళేడు.

ఆవిడ వచ్చింది. ఆవిడకి ముప్పై యేళ్ళ పైబడి వయస్సుంటుంది. ఆకర్షించగల సౌమ్యత ఆవిడలో కొట్టొచ్చినట్టు కనుపిస్తోంది.

"అతనూ వాళ్ళావిడా ఒకగంట క్రితం వూళ్ళోకి వెళ్ళేరు. వచ్చే వేళయింది. కాసేపు కూర్చోండి."

".. .. .. .."

"ఒరే. చిన్నీ ! బాబాయి గదిలో పుస్తకాలున్నాయి గానీ వారికివ్వు. చదువుకుంటారు." అని మళ్ళా గదిలోకి వెళ్ళిపోయింది.

చిన్ని అనబడే తొమ్మిదేళ్ళ కుర్రాడు చాలా పుస్తకాలు తెచ్చేడు. తెచ్చి సోఫాలో పెట్టి అన్నాడు

"మా బాబాయి చాలా బాగా పాడతాడండీ. మీరివి చదువుతూండండి. నేను రికార్డు వేస్తాను."

వాడు అక్కడ దగ్గర్లో ఉన్న టేప్ రికార్డర్ని ఆన్ చేసేడు. సుధాకరం కాబోలు చాలా హాయిగా పాడుతున్నాడు. అతని గొంతులో ఇంత అమృతముందని తెలియడం ఇదే మొదటిసారి.

పాటైన తర్వాత కాసేపటికి ఏదో సంభాషణ వినిపించింది—

'ఇదిగో అమ్మాయ్ ? నువ్వు పాడకపోతే నేనూరుకునేది లేదు. కదరా చిన్నీ' అన్నాడు సుధాకరం.

'అవును. అంతే. పాడాలి.' అన్నాడు చిన్ని.

'వూహూ. నే పాడను. పాడనన్న తర్వాత పాడనూ, అంతే' అన్నది వరలక్ష్మి.

చిన్ని వాళ్ళమ్మ అక్కడికి గబగబా వచ్చి, టేప్ రికార్డర్ని ఆఫ్‌చేసి చిన్నితో అన్నది.

"తప్పుకదూ !"

"అది కాదమ్మా !"

"చాల్లే వూరుకో. వీడు వట్టి చిలిపివాడండి. వాడికి తోచదు. చెబితే వినడు. వాళ్ళనాన్నగారూ, బాబాయీ బాగా గారాం చేసేరు."

".. .. .."

"ఒక్క క్షణం. . ఇప్పుడే కాఫీ తీసుకొస్తాను."

"మీకు చాలా శ్రమనిస్తున్నాను."

ఆవిడ నవ్వేసి వెళ్ళిపోయింది.

చిన్ని చలం పక్కకొచ్చి కూర్చున్నాడు. వాడీ మధ్య చూచిన సినిమా గురించి చెప్పడం మొదలెట్టాడు. చిన్ని ముద్దుగా ఉంటాడు. వాడి మాటలూ తనివితీరా వినాలనిపిస్తాయి.

చిన్ని వాళ్ళమ్మ కాఫీ తీసుకొచ్చి ఇవ్వడం, బైట కారాగిన శబ్దమూ ఒకేసారి జరిగేయి. చిన్ని సోఫాలోంచి దిగి—

"బాబాయ్ వాళ్ళు వచ్చారండోయ్" అంటూ లేడిపిల్లలా పరుగెత్తుకు పోయేడు.

వాళ్ళు హాల్లో కాలుపెట్టే సరికి చలం తాపీగా కాఫీ తాగుతున్నాడు. వరలక్ష్మి అతన్ని చూడగానే



“అరె. . ఎప్పుడొచ్చేరు ?”

చలం నవ్వులాటిది మొహాన్ని నింపేసుకున్నాడు.

“మీకు చెప్పానే చలమని.”

“యస్. గుర్తుంది. హేపీ టూ సీయూ.” అన్నాడు సుధాకరం.

చలం తల పంకించేడు.

“మీగురించి చాలా చెప్పింది. నేనొక్కటి గూడా మరిచిపోలేదు సుమండీ ! ఎప్పుడొచ్చేరు.”

“ఉదయం.”

“చాలా థాంక్సండి” అన్నది వరలక్ష్మి

“సరిసరి నీ థాంక్సుకే మొచ్చేగానీ, ముందు వారి స్నానానికి. . .”

“అన్నీ హోటల్లో ముగించే వచ్చాను.”

“మీరు హోటల్లో దిగేరా ? అంతే వరలక్ష్మి అబద్ధం చెప్పి ఉండాలి. మీరు మంచి స్నేహితులని...”

“ఆయన అనడానికి నువ్వు చెప్పడానికి సరిపోయింది సుధా! ఇప్పుడు మాత్రం మించి పోయిందేముంది ? ఇక మళ్లా ఆ హోటల్ మొహం చూడరు. అంతే.” అన్నారు వదినగారు.

చలం మీనమేషాలు లెక్కపెడుతున్నాడు. మధ్య మధ్య సుధాకరం అడిగే ప్రశ్నలకి అవునూ కాదూ అని సమాధానాలు చెబుతున్నాడు. ఎప్పుడు ప్రారంభమైందో గాని సుధాకరం కథని మధ్య నుంచి వినగలిగేడు చలం.

“యువెమ్మెస్సీ పాసయ్యాను. అన్నయ్య మాట ప్రకారం వ్యాపారం మొదలెట్టేను. నన్ను పెంచింది అన్నయ్య. అదృష్టవంతుడ్నని వదిన ఎప్పుడూ నన్ను పొగుడుతుంది. కేవలం పొగడ్తలే అనుకున్నానేగాని వరలక్ష్మితో పెళ్లయిన తర్వాత నిజమని ఒప్పుకోక తప్పింది కాదు. ఏమంటావ వరాలూ—”

వరలక్ష్మి సిగ్గుపడిపోయి తలొంచుకుంది. వరలక్ష్మిని ఇంకేం అడిగేవాడో తెలీదు గాని ఫోన్ మోగడంతో అంతరాయం కలిగింది. ఫోన్ తీసుకున్నాడు సుధాకరం. అతను ఫోన్‌లో చెప్పిన మాటలివి—

“సారీ బ్రదర్. మాట తప్పాల్సొచ్చింది. ఈ వేళ మా ఫ్రెండ్ వచ్చారు. గనక మన ప్రోగ్రాంకి తిలోదకాలు. క్షమించు.”

చలం నీళ్లు నమిలేడు. సుధాకరం వచ్చి కూర్చుని అన్నాడు—

“అచ్చా సార్! ఈ వేళ ఫస్టుషోకి వెడదాం. అంతవరకూ— పైగా మీకు పేకాట ఆడటం వచ్చుటగా. వరలక్ష్మి చెప్పిందిలెండి. కమాన్. ఒక పట్టు వేద్దాం. ఏమంటావ్ వరాలూ !”

వరలక్ష్మి పేక తీసుకు రావడానికి లోపలి కెళ్లింది.

* * *

జరిగిందంతా గుర్తు చేసుకుంటూంటే చలానికి ఏడుపు ముంచు కొస్తోంది. అతన్లో ఓ మూల దాగిన రాక్షసత్వానికి సిగ్గుపడిపోతున్నాడు. ప్రాయశ్చిత్తం కావాలి.

హత్య చేయడం అంత సులువైన పనికాదు. ఉద్రేకం మనిషిని హంతకుడ్నిగా చేయవచ్చు గానీ— కొంచెం ఆలోచించడానికి వ్యవధి దొరుకుతే మనిషి మంచివాడుగానే మిగిలిపోతాడు.

ఆ హోటల్ గదిలో అతనొక్కడే ఉన్నాడు. తలుపు గడియ వేశాడు. టీపాయ్ మీద మూడు గ్లాసులు పెట్టబడి ఉన్నాయి. మూడింట్లోనూ ద్రాక్షరసం పోసేడు. సూటుకేసులోంచి చిన్న పొట్లాం తీసేడు. దాన్లోని పొడినంతా ఒకే గ్లాసులో వంచుకున్నాడు. ఆ గ్లాసుని తాను తీసుకున్నాడు.

“అన్ని విధాలా నోడిపోయిన వెధవని. కసిగట్టి మిమ్మల్ని చంపుదామని వచ్చేను. అప్పుడా ? కాని.. వద్దు. మీరు ఆనందంగా బ్రతకండి. ఇంత ఘాతుకం తలపెట్టిన నన్ను చావనివ్వండి. ఆల్ రైట్ మీరు ఆ గ్లాసుల్లోది తాగండి. నేనిది తాగుతాను. నాకిదే కావాలి. బై.”

అతను కళ్లు మూసుకున్నాడు. కాని కన్నీటిని అదుపులో పెట్టుకోలేక పోయేడు. గ్లాసులోని ద్రాక్షరసం నోట్లో చేరింది. అలాగే ఒరిగిపోయేడు.

—తెల్లవారుతూండగా జనార్ధనరావు అదే హోటల్‌గది తలుపు తట్టేడు. నిక్షేపంలాంటి తన ఒంటి కాలితో నేలమీద వింత దరువు వేస్తూ మరొకసారు తట్టేడు. తలుపు తెరుచుకుంది. తలుపు తెరిచిన చలం ఆశ్చర్యంతో స్థాణువులా నిలబడి పోయేడు.

“మనం బ్రతుకుదాం. వాళ్ళనీ బ్రతకనిద్దాం. సరేనా ?” అన్నాడు జనార్ధనరావ్.

జవాబుకి ఏం చెప్పాలో వెంటనే తోచింది కాదు. ★

---

## బంగారు నడచిన బాట

23 వ పేజీ తరువాయి

గడు ప్రశంసనీయం !” అంటూ గ్రద్ద తన రెక్కలతో చప్పట్లు చరిచింది.

“మహా ప్రసాదం !” అంది నక్క. “ఏలినవారి ఆదరాభిమానాలకు కృతజ్ఞుణ్ణి !. . . ప్రభువుల వారు నాకు మరొక్క ఉపకారం చేయాలి !”

“అవశ్యం సెలవియ్యి ! పరోపకారార్థమిదం శరీరమ్ అని కదా పెద్దలన్నారు. తోడిసోదరులకు చేతనైన సహాయం చేయడం కంటె మించిన ఆదర్శం మరేమున్నది ?. . . .”

“ప్రభువుల వారికి అదేమంత గొప్ప కార్యం కాదు. నా వద్ద అయిదు ఆవులున్నాయి కదా ? వాటి శరీరాలు వాటికి గాక పరులకు ఉపకరిస్తే— అది వాటికి శుభమేకదా ? ! కాని, వచ్చిన చిక్కేమిటంటే— ఆ శరీరాల మీద జీవాత్మ యొక్క అదుపు ఎక్కువగా ఉన్నది. చిన్న శరీరాలే అయితే ఇబ్బందిలేదు. కాని, ఇవి పెద్ద శరీరాలు. కనుక ఆ జీవాత్మలకక్కడ స్థాన బలిమి ఎక్కువగా ఉంది. దేవరవారు నాకు ఈ విషయంలో తగిన సహాయం చేసిపెట్టాలని వేడుకుంటున్నాను. పాలను, నీటిని వేరు చేయగల శక్తి హంసకే ఉంది. జీవుణ్ణి, శరీరాన్ని వేరుచేయగల శక్తి తమబోటి తపోధనులకే ఉంటుంది !”

సర్వమంగళం తన ముఖం మీద మోసులెత్తిన ఆనందరేఖల్ని గాంభీర్యం చాటున దాచుకొంది. కొంతసేపు ఆలోచన అభినయించి, ఇలా అంది. “మిత్రమా !. . . నా సహాయం కోరి ఇంత దూరం వచ్చిన వాడివి— నిన్ను నిరాశాపూరితుణ్ణి చేయ్యడం నా అభిమతం కాదు. అందున ఆడితప్పడం నా ఒంటిలోనే లేదు. సరే ! నీవు కోరిన ఉపకారం ఇప్పుడు చేయమన్నా నా అభ్యంతర మేమీలేదు. అయితె, ఒక చేతితో చేసిన ఉపకారం రెండో చేతికైనా తెలియకూడదంటారు పెద్దలు. కనుక చేయవలసిన తతంగమంతా నా గుహాలోపలే జరిగి పోవడం మంచిది.”

“జానాను ! రాజావారి ఇష్టానుసారం చెయ్యడమే శ్రేయస్కరం.” అన్నది గ్రద్ద.

“చిత్తం ! ఒక్క క్షణం వ్యవధి ఇస్తే ఒక ఆవును వెంట బెట్టుకొస్తాను.” అంటూ కనుమవైపు దూసుకు పోయింది నక్క. “జాగ్రత్త ! ప్రచారం నా కిష్టంలేదు.” అంటూ బిగ్గరగా కేక పెట్టింది పులి.

టక్కుటమారం కనుమలోకి వెళ్ళింది. ఒక ఆవును తన వెంట బెట్టుకొని వెనుదిరిగింది. ఇక ఇప్పుడది ఆనందంతో ఉబ్బి పోతున్నది. తన సమస్య పరిష్కారమవ్వడమే గాక, తనకు పులిరాజు స్నేహం కూడ లభించింది. తన పట్ల ఎంతో అనుగ్రహం చూపింది పులి. తనకు రాజబంధువు అన్న బిరుదాన్ని కూడ ప్రసాదించింది. గొప్పవారి అండదండలుంటే అన్నీ ఉన్నట్లే !

దారిలో— కొమ్మ నుండి కొమ్మకు పిల్లిమొగ్గలు వేస్తున్న చిట్టికోతి నక్కను చూసి “బావగారు ఆవుటక్కతో కలిసి ఎక్కడికో ప్రయాణం కట్టారే ?” అని అడిగింది. నక్క జవాబు చెప్పలేక తడబడింది. “పులిరాజుగారి ఆశ్రయానికి ! రాజుగారు ముక్తి మార్గం సెలవిస్తారట. అదేమిటో ఆవుటక్క కూడ వినని !” అని జవాబిచ్చింది చివరికి.

అవి గుహను సమీపించాయి. గర్భగుడిలో దేవుడిలా పులి గుహలోపలికి వెళ్ళిపోయింది. “లోపలికి పద !” అంది నక్క ఆవుతో. ఆవు బెదురుతూ బెదురుతూ లోపలికి నడిచింది. పులి గబుక్కున దాని మీదికి దుమికి, కోటితో గొంతు పట్టుకుని నెత్తురు గుటగుటా త్రాగేసింది. ఆవు బిగ్గరగా అరవడానికి ప్రయత్నించింది. కాని దాని గొంతు జీరబోయింది. కాళ్ళు విలవిల లాడించుకుంటూ నేలకొరిగి పోయింది.

పులికి, నక్కకు, గ్రద్దకు ఆ పూట పసందైన విందు. “ఆవు నెత్తురు, మాంసము ఇంత రుచిగా ఉంటాయని నాకు ఇంతవరకు తెలియదు సుమా?” అంటూ పులి మీసాలు దువ్వుకొంది. అది ఆవును చంపి తినడం ఇదే మొదటిసారి. నక్కకు తాను చేసిన ఉపకారాన్ని గురించి దండోరా వేయవద్దని అది గ్రద్దను మరోసారి హెచ్చరించింది.

తూరుపు తెలతెలవారుతున్నది.

ఆ సూర్యోదయం ఆ మిత్రత్రయానికి ఎంతో ఉత్సాహాన్ని కలిగించింది. భవిష్యత్తులో వాటికి రక్తపు కాలువల్లు, మాంసపు గుట్టలు కనిపిస్తున్నాయి.

(ఇంకా ఉంది)







అల్లాగ! అయితే, ఆమెకు ఒక చాక్‌లెట్
ఇవ్వాలి—
పాల యొక్క గుణములు
కలిగిన క్యాడ్‌బరీస్ చాక్‌లెట్!

Cadbury's క్యాడ్‌బరీస్ చాక్‌లెట్

మిఠాయిని మించినది... ఆహారము!

**4-12-1964 శుక్రవారము మొదలు**
**10-12-1964 గురువారము వరకు.**

| మీ | మే | వృ | మి |
|---|---|---|---|
| | గు | | రా |
| శ | వారఫలం | | |
| | మ హే ష్ | | కు |
| బు కే | ర చం | శు | |

## మేషం :

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ఈ వారం ప్రారంభంలో వృత్తి వ్యాపారాల్లో ఆందోళన కలిగించే పరిస్థితులు ఏర్పడినా రానురాను అన్ని వ్యాపారాల్లోను ప్రోత్సాహం లభించగల సూచనలు ఉన్నాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు ప్రారంభంలో మీరు ఊహించినంత సంతృప్తికరంగా ఉండకపోవచ్చును. వృత్తిలో ఇంతవరకు ఉన్న పోటీ చాలవరకు తగ్గడంవలన మీ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరతాయి. ఉద్యోగంలో మీకు అనుకూలంగా చిన్న చిన్న మార్పులు రావచ్చును. కోర్టు వ్యవహారాలు మాత్రం ఇంకా అంత అనుకూలంగా ఉండవు. ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు బాగా ఉండకపోవచ్చును. అలంకార వస్తువులు కొంటారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. సాంఘిక కార్యక్రమాలు సంతృప్తికరంగా ఉంటాయి. బంధువులకు సహాయం చేస్తారు.

## వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగ 1, 2 పా.)

వృత్తి వ్యాపారాల్లో మీ ప్రస్తుతపు కార్యక్రమాలు మామూలుగానే ఉన్నా మీరు ఇదివరకు జరిపిన వ్యవహారాల్లో కలిగిన చికాకులు చాలవరకు తగ్గిపోవడం వలన ఈవారం సంతోషకరమైన భావం ఏర్పడుతుంది. ముఖ్యమైన వ్యవహారాలు భాగస్వాముల నిర్ణయానికి వదిలివేయడం మంచిది. వృత్తిలో కొన్ని అవకాశాలు ఇంద్రధనుస్సువలె ఆకర్షణీయంగా కన్పిస్తాయి గాని అవి కార్యరూపాన్ని పొందడం కష్టం. ఉద్యోగంలో మీకు సంబంధంలేని వ్యవహారాల్లో శ్రమ పొందవలసి వస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో కొంత అభివృద్ధిని సాధించడానికి అవకాశం ఉంది. ఆరోగ్యము అంత బాగా ఉండదు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

## మిథునం :

(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు, 1, 2, 3 పా.)

మీరు ప్రయత్నించిన వ్యవహారాలు అన్నీ నెరవేరుతూ ఉన్నా ఏదో ఒక కారణం వలన మానసికాందోళన కలగగల సూచనలు ఉన్నాయి. అధికారుల వలన జరగవలసిన పనులకు ఏర్పడిన ఆటంకాలు చాలవరకు తొలగిపోతాయి. వృత్తిలో మునుముందు మీకు లాభించగల ఒప్పందాలు, ఏర్పాట్లు మొదలైన వాటి విషయంలో అభివృద్ధిని సాధించగలరు. ఉద్యోగంలో మీ అభిప్రాయాలను అమలుజరుపడానికి అవకాశం లభించడంవలన మీ శక్తి సామర్థ్యాలను రుజువు చేయగలరు. మీ ఆరోగ్యం బాగానే ఉంటుంది కాని కుటుంబంలో ఇతరులకు అనారోగ్యం చేయవచ్చును.

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. సాంఘిక కార్యక్రమాలు అనుకూలంగా ఉంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

## కర్కాటకం :

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)

ఈ వారం వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలన్నీ నిరాటంకంగానే నెరవేరతాయి గాని మీకు డబ్బు ఇవ్వవలసినవారికి కొన్ని చికాకులు రావడంవలన మీరు కూడా ఆర్థికంగా తాత్కాలికమైన ఇబ్బందికి గురికావలసి వస్తుంది. దీర్ఘకాలానికి ఫలితాన్నిచ్చే భారీ వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభించగల సూచనలు లేవు. వృత్తిలో మీ పరిశ్రమకు తగిన ప్రతిఫలాన్ని పొందగలరు. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయతగదు. పుణ్యకార్యాలు చేస్తారు.

స్త్రీలకు—ఆరోగ్యం సాధారణంగా ఉంటుంది. బంధుమిత్రులను కలుసుకొంటారు. ప్రయాణాలోచనలు చేస్తారు.

## సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

ఈ వారం వృత్తి వ్యాపారాల్లో విశేషమైన ప్రయోజనాన్ని ఆశించడానికి అవకాశంలేదు. మీరు స్వంతంగా చేసే వ్యాపారాలకంటె భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఏదో కారణాలవలన వృత్తిలో ఇదివరకు ఆగిపోయిన వ్యవహారాలను ఈవారం తిరిగి ప్రారంభించగలరు. ఆర్థిక వ్యవహారాలు గతవారంలో కంటె బాగా ఉంటాయి. ఉద్యోగంలో మీ పరిస్థితి యథాతథంగా ఉంటుంది. కోర్టు వ్యవహారాల్లో అనవసరమైన శ్రమకు గురికాగల సూచనలు ఉన్నాయి. ఆరోగ్య విషయంలో అశ్రద్ధచేయడం తగదు.

స్త్రీలకు—ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో మార్పులు రావచ్చును. విలాస వస్తువులు కొంటారు.

## కన్య :

(ఉత్తర 2, 3 4 పా, హస్త, చిత్త 1, 2 పా)

వృత్తి వ్యాపారాలు పైకి ప్రశాంతంగానే ఉన్నట్లు కన్పిస్తాయి. గాని మీరు ఏమాత్రం ఏమరుపాటు చూపినా నష్టం తప్పదు. భాగస్వాములతో ఏర్పడిన భేదాభిప్రాయాలు చాలవరకు తొలగిపోవడంవలన వ్యాపారంలో అభివృద్ధిని సాధించడానికి అవకాశం ఉంది. వృత్తిలో మీరు చేపట్టిన నూతన కార్యక్రమాల్లో లాభం అంతగా ఉండకపోవచ్చును. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. ఈవారం మీరు జరిపే వ్యవహారాల్లో కొంత డబ్బు చిక్కుబడిపోయే ప్రమాదం ఉంది. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరగగల సూచనలు ఉన్నాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉంటుంది. శుభ కార్యాల విషయంలో అనుకూలమైన సంఘటనలు జరగవచ్చును.

> **ఈవారం ధరలు**
>
> అపరాల ధరలు కొంచెం తగ్గడానికి అవకాశం ఉంది. బెల్లపు ధరలకు కూడా ఉండకపోవచ్చును. నూనె నువ్వుల ధరలు వారం ప్రారంభంలో కంటె వారాంతంలో పెరుగుతాయి. బెల్లం ధర పెరిగే సూచనలు ఉన్నాయి. అలంకార వస్తువుల ధరల్లో మార్పులు రావు.

## తుల :

(చిత్త 3,4 పాదాలు, స్వాతి, విశాఖ, 1,2,3 పా)

ఈ వారం గత వారం కంటె బాగా ఉంటుంది. అధికారులవలన జరగవలసిన పనులు విశేషమైన శ్రమ లేకుండా నెరవేరడంవలన వ్యాపారంలో ఆదాయం పెరగడానికి అవకాశం ఏర్పడుతుంది. ఆర్థిక వ్యవహారాల్లో అనుకూల పరిణామాలు ఏర్పడవచ్చును. సాహసముతో కూడిన వ్యవహారాల్లో శ్రమమీద స్వల్ప లాభాన్ని పొందగలరు. వృత్తిలో ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. మీకంటె పెద్దలు కూడా మీ సలహాను మన్నిస్తారు. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

స్త్రీలకు—సాహిత్య కళారంగాల్లో ఖ్యాతిని పొందగలరు. బంధువులతో మాటపట్టింపులు రాగల సూచనలు ఉన్నాయి.

## వృశ్చికం :

(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

ఆర్థిక వ్యవహారాలకంటె ఆరోగ్య విషయంలో శ్రద్ధ అవసరం. వృత్తి వ్యాపారాల్లో మీకు ప్రముఖుల అండదండలు లభించడంవలన తగిన అభివృద్ధిని సాధించగలరు. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు సామాన్యంగా ఉన్నా రానురాను ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తిలో మీ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. ఉద్యోగంలో మార్పులు ఏమీ రాకపోవచ్చును. ఆర్థిక వ్యవహారాల్లో విశేషమైన లాభాలను ఆశించడానికి అవకాశంలేదు. స్థిరాస్తి వ్యవహారాలు లాభదాయకంగా ఉంటాయి. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాలు బలహీనపడే సంఘటనలు జరగవచ్చును.

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరతాయి.

### ధనుస్సు :

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

వృత్తి వ్యాపారాల్లో సామాన్య వ్యవహారాలకు కూడా విశేషమైన ప్రయత్నం చేయవలసి వచ్చినా తుదకు విజయం చేకూరడంవలన ఈవారం బాగానే ఉందని పిస్తుంది. వ్యాపారంలో ఇతరులమీద ఆధారపడి ఏ కార్యక్రమమూ ప్రారంభించడం మంచిదికాదు. ఆదాయం మామూలుగానే ఉన్నా రావలసిన డబ్బు సమయానికి అందగల సూచనలు ఉన్నాయి. వృత్తిలో ప్రయోజనకరమైన పరిచయాలు లభించవచ్చును. ఉద్యోగంలో మీ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. స్నేహితుల వ్యవహారాల్లో జోక్యం కలిగించుకోవలసి వస్తుంది. ఆరోగ్యం బాగానే ఉంటుంది.

స్త్రీలకు—ఆరోగ్యం గత వారంలో కంటే బాగా ఉన్నా వారారంభంలో మానసికాందోళన కలుగవచ్చును. అలంకార వస్తువులు కొంటారు.

### మకరం :

(ఉషా 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1,2 పా.)

ఈ వారం, ప్రారంభంలో సామాన్యంగా ఉన్నా రానురాను అన్ని వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. వ్యాపారంలో, మీ అభిప్రాయాలు సరియైనవని రుజువు కావడంవలన భవిష్యత్తుమీద విశ్వాసం ఏర్పడుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో ఇతరుల జోక్యం వలన నష్టం రావచ్చును. రావలసిన డబ్బుమీద ఆధారపడి వాగ్దానాలు చేయడం మంచిది కాదు. వృత్తిలో మీ పరిస్థితి గత వారంలో కంటే బాగా ఉంటుంది. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. సాహిత్యకళారంగాల్లో మీ కృషి రాణించడానికి తగిన అవకాశం లభించవచ్చును.

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. శుభమూలంగా ధనవ్యయం జరుగుతుంది. పుణ్య కార్యాలు చేస్తారు.

### కుంభం :

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భా. 1, 2, 3పా)

ఈ వారం చిత్రంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో మీరు ఎంతో కృషిచేసిన వ్యవహారాలకు ఆటంకాలు రావడం, మీరు అసాధ్యం అనుకొన్న వ్యవహారాలు నెరవేరడం వంటి సంఘటనలు జరగవచ్చును. అధికారులవలన జరగవలసిన పనులు కొంతమంది మిత్రుల తోడ్పాటువలన సులువుగా జరగడానికి అవకాశం ఏర్పడుతుంది. వృత్తిలో యిదివరకు ఏర్పడిన చికాకులు తొలగిపోతాయి. ఉద్యోగంలో సాటివారితో భేదాభిప్రాయాలు రాగల సూచనలు ఉన్నాయి. ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో అనుకూల వార్తలను వింటారు. ప్రేమ వ్యవహారాల్లో కొత్త సమస్యలు తల యెత్తవచ్చును.

స్త్రీలకు—ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయతగదు. కుటుంబ వ్యవహారాలు కొంత శ్రమమీద నెరవేరతాయి.

# వారఫలం

### మీనం :

(పూ. భాద్ర, 4 పా, ఉ. భా. రేవతి.)

వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు మీరు ఊహించిన దానికంటే చురుకుగా సాగవచ్చును. కాని, ఫలితం అంత సంతృప్తికరంగా ఉండకపోవచ్చును. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాల్లో నూతనావకాశాలు లభిస్తాయి. వాటివలన ముస్ముందు విశేషంగా యోగించడానికి అవకాశం ఉంది. ఆర్థిక వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. కోర్టు వ్యవహారాల్లో మీ వాదం గెలవడానికి అవసరమైన పరిస్థితి ఏర్పడుతుంది. ఆరోగ్యం బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు యిదివరకటికంటే బాగా ఉంటాయి. మీకు అంతగా యిష్టం లేకపోయినా బంధువుల వ్యవహారాల్లో జోక్యం చేసికొనవలసి వస్తుంది.

స్త్రీలకు—సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యము పెరుగుతుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి. అలంకార వస్తువులు కొంటారు.



# జన్మదినఫలం

### డిశంబరు-4

ఈ సంవత్సరం వృత్తి వ్యాపారాల్లో అనుకూలంగానే ఉన్నా ఏదో ఒక కారణంవలన ఎప్పుడూ ఆందోళనకలగగల సూచనలు ఉన్నాయి. దీర్ఘకాలానికి ఫలితాన్నిచ్చే భారీ వ్యాపారాల్లో క్రమాభివృద్ధిని సాధించగలరు. భాగస్వాములతోకలిసి చేసే వ్యాపారాల్లో నూతనావకాశాలు లభించడంవలన ఆదాయం పెరగవచ్చును. వృత్తిలో అనుకూల పరిస్థితి ఏర్పడుతుంది. ఉద్యోగంలో అనుకూలమైన స్థానమునకు మార్చబడగల సూచనలు ఉన్నాయి. కొన్ని వ్యవహారాల్లో, మీరు ఎంత జాగ్రత్తగా ఉన్నా కోర్టువరకు వెళ్లవలసిన పరిస్థితి ఏర్పడవచ్చును. ఆరోగ్యం సామాన్యంగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో అప్పుడప్పుడు చికాకులు రావచ్చును. దూర ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది. విద్యార్థులు సాధారణంగా కృతార్థులు కాగలరు. రాజకీయనేతలకు మంచి సమయం.

### డిశంబరు-5

వృత్తివ్యాపారాల్లో అప్పుడప్పుడు మీకు అంతగా ఇష్టంకాని పరిస్థితులు ఏర్పడినా, మొత్తం మీద ఈ సంవత్సరం అన్ని వ్యవహారాల్లోను తగిన అభివృద్ధిని సాధించడానికి అవకాశం ఉంది. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు సామాన్యంగా ఉంటాయి. సంవత్సరం మధ్యలో సాహసముతోకూడిన వ్యవహారాలు లాభించగల సూచనలు ఉన్నాయి. వృత్తిలో సాటివారితో పోటీ తగ్గడంవలన మానసికంగా విశ్రాంతి లభిస్తుంది. ఉద్యోగంలో కొంత కార్యభారం పెరిగినా, మీ శక్తిసామర్థ్యాలను అధికారులు గుర్తించగలరు. అప్పుడప్పుడు ఆర్థికంగా ఒడుదుడుకులు రావచ్చును. ఆరోగ్యం ప్రస్తుతం బాగావున్నా నిర్లక్ష్యంచేయ తగదు. కుటుంబ వ్యవహారాల్లో అనవసరమైన వ్యయం జరుగుతుంది. సంతోషకరమైన వార్తలను వింటారు. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కావచ్చును.

### డిశంబరు-6

గడచిన కొద్ది సంవత్సరాలకంటే ఈ సంవత్సరం ప్రోత్సాహకరంగా ఉంటుంది. దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలి అన్నట్లుగా మీ భవిష్యదభివృద్ధికి తోడ్పడే దీర్ఘకాలిక ప్రణాళికలు అమలుజరపడానికి అనువైన సమయం. వృత్తి వ్యాపారాల్లో ఆదాయంతోపాటు పలుకుబడికూడా పెరుగుతుంది. భాగస్వాములతో కలిసిచేసే వ్యాపారాలకంటే స్వంతంగాచేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఉద్యోగంలో ఉన్నత స్థానం లభించడానికి అవకాశం ఉంది. రాజకీయ వ్యవహారాల్లో నూతనోద్యమాలను ప్రారంభించి విజయాన్ని సాధించగలరు. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. కొంతమంది బంధువులు తమ స్వార్థంకోసం మీ కుటుంబంలో భేదాభిప్రాయాలు కలిగించడానికి ప్రయత్నం చేస్తారు. విద్యార్థులకు క్లాసు రాగల సూచనలు ఉన్నాయి.

### డిశంబరు-7

వృత్తి వ్యాపారాల్లో అనుకూలంగానే ఉన్నా ప్రతి వ్యవహారంలోను ఏదో ఒక సందేహం కలుగుతూ ఉండడంవలన సాహసించి ఏ పనీ చేయలేరు. కాని తరువాత తరువాత మీ సందేహాలు సరియైనవే అని రుజువుకావడంవలన ఏమీ చేయలేకపోయినా సంతృప్తికరంగా ఉంటుంది. ఆర్థిక వ్యవహారాల్లో ఇదివరకు ఏర్పడిన చికాకులు తొలగిపోతాయి. రావలసిన డబ్బు సమయానికి అందగల సూచనలు ఉన్నాయి. వృత్తిలో వ్యయప్రయాసలమీద స్వల్పాభివృద్ధిని సాధించగలరు. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. కాని తగిన ప్రతిఫలం ఉండకపోవచ్చును. ఆరోగ్యం బాగానే ఉన్నా శరీర శ్రమతో కూడిన కార్యక్రమాలు పనికిరావు. కుటుంబ వ్యవహారాలు ఇదివరకంటె బాగా ఉంటాయి. తీర్థయాత్రలు చేస్తారు. విద్యార్థులు కొంచెం శ్రమమీద కృతార్థులు కాగలరు.

## డిశంబరు-8

జీవితంలో చాలా ముఖ్యమైన సమయం. ఈ సంవత్సరం మీరు జరిపే వ్యవహారాల ప్రభావం రాబోయే సంవత్సరం మీదకూడా ఉంటుంది. కాబట్టి అన్ని వ్యవహారాల్లోనూ చాలా జాగ్రత్తగా వ్యవహరించడం అవసరం. వృత్తి వ్యాపారాల్లో ఇంతవరకు మీ అభివృద్ధికి ఆటంకంగా ఉన్న వ్యవహారాలు మీకు అనుకూలంగా పరిష్కారం కావడంవలన మీ భవిష్యదభివృద్ధికి మార్గం ఏర్పడుతుంది. నూతన వ్యాపారాల్లో ఆదాయం పెరగగల సూచనలు ఉన్నాయి. వృత్తిలో ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. ఉద్యోగంలో మీరు ఇదివరకు జరిపిన కృషి ఇప్పుడు ఫలించవచ్చును. కోర్టు వ్యవహారాలలో స్నేహితుల సహకారం లభిస్తుంది. సాంఘిక వ్యవహారాల్లో ప్రముఖ పాత్ర వహించగలరు. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కావచ్చును.

## డిశంబరు-9

మీరు ఘన విజయాల్ని ఏమీ సాధించలేకపోయినా, వృత్తివ్యాపారాల్లో మీరు అనుకున్నట్లుగా జరగడంవలన ఈ సంవత్సరం సంతృప్తికరంగానే ఉంటుంది. మిమ్మల్ని ఎదుట పొగడుతూ, చాటున దూషించే వ్యక్తులతో వ్యవహరించవలసిన అవసరం ఏర్పడవచ్చును. మీరు గత సంవత్సరం ప్రారంభించిన వ్యవహారాలు ఈ సంవత్సరం పూర్తి చేయగలరు. వృత్తిలో నూతనావకాశాలు లభించవచ్చును. కాని ఫలితం అంత సంతృప్తికరంగా ఉండదు. ఉద్యోగంలో మార్పులకోసం మీరు చేసే ప్రయత్నాలు ఫలించడానికి అవకాశం ఉంది. ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో భేదాభిప్రాయాలు కలిగినా వాటివల్ల ఏ కార్యక్రమమూ ఆగిపోదు. బంధువుల వ్యవహారాల్లో విజయాన్ని సాధిస్తారు. విద్యార్థులు మొదటినుంచి శ్రద్ధగా చదవడం మంచిది.

## డిశంబరు-10

వృత్తి వ్యాపారాలు మామూలుగా జరిగిపోయినా, మీకు ఇంతవరకు సన్నిహితంగా ఉన్నవారితోనే కొన్ని భేదాభిప్రాయాలు కలగడంవలన ఈ సంవత్సరం అంత సంతృప్తికరంగా ఉండదు. వ్యాపారంలో మీ శ్రమకు తగిన ప్రతిఫలాన్ని పొందగలరు. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు క్రమంగా ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తిలో కొంతమంది మీకు ఆశలు కల్పించి తాము ఆనందించడానికి ప్రయత్నం చేస్తారు. ఆర్థిక వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. రావలసిన డబ్బు మీద ఆధారపడిన నూతన వ్యాపారాలు ప్రారంభించడం మంచిదికాదు. స్థిరాస్థి వ్యవహారాలు ఇదివరకటికంటె అనుకూలంగా ఉంటాయి. ఆరోగ్యం బాగానే ఉంటుంది. కాని కాలడం జారిపడడంవంటి ప్రమాదాలు కలగవచ్చును. కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. విద్యార్థులు సాధారణంగా కృతార్థులు కావచ్చును.



ఆ అధిక
తెలుపును
చూడండి!
మెక్లీన్స్
వల్లనే





ఇట్లు శోధించి చూడండి
1. మీనాలుకకొనతో మీ పళ్లమీదతడమండి, జిగటగా అంటుచున్న పొర తగులుచున్నదా?
2. ఇప్పుడు బ్రష్‌తో తోమండి, మీరు చవి చూచునట్టి జలదరించే పరిశుభ్రతగల రుచి మెక్లీన్స్ పనిచేయుచున్నదనుటకు నిదర్శనం...మీ పళ్లను శుభ్రపరచుచున్నది, కాపాడుచున్నది, తెల్లగాజేయుచున్నది.
3. అధిక శుభ్రతను గమనించండి...అధిక తెలుపును చూడండి! మెక్లీన్స్ వల్లనే.




మెక్లీన్స్ పసుపురంగుగా వుండే పళ్లను తెల్లగా జేయును.

టున్నాం. మీరు ఫోన్ రేఖ ఉండన్నారుగా? దాని గురించి......గభాలున ఆ సినిమా డైలాగు ఎందుకు జ్ఞాపకం వచ్చిందో?''

ప్రభాకర్ ఆలోచనలో పడ్డాడు.....ఇదేదో చిన్న విషయంకాదు. తన గురించి మాట్లాడుతూ ప్రేయసి వెందుకు తలపోసుకున్నట్టు? అదీ గీత ముందు!

ప్రభాకర్ కళ్ళు మూసుకున్నాడు....'ప్రేయసి కోసం వేస్తున్న వేషం!'......మబ్బుల మాటున దాగిన చందమామ మబ్బులు తొలగిపోగానే ప్రకాశిస్తూ ప్రత్యక్షమవుతాడు. ఇంతవరకు పాత స్మృతులను మరపు అనే మబ్బు కప్పివేసింది. ఆ మబ్బు విడిపోవటంతో పాత స్మృతులు కట్టె దాటుకువచ్చి నిలిచాయి. ప్రభాకర్ ఉలిక్కిపడ్డాడు... ప్రభాకర్‌అన్న పలుకులా ఇవి?......తొందరగా మోహన్ దగ్గర కెళ్ళాలి.

సర్వర్ ఫలహారం ప్లేట్లను బల్లమీదపెట్టి వెళ్ళాడు. వేడి వేడి ఇడ్లీలు, పొగలు గ్రక్కుతున్న సాంబారు! అయినా ప్రభాకర్ చలించలేదు. గభాలున లేచి " నేను అర్జంటుగా వెళ్ళాలి!" అన్నాడు.

గీత తెల్లబోయింది. మగవాళ్ళు ఇంత చిత్రంగా ప్రవర్తిస్తారెందుకని? అర్జంటు పనుంటే హోటల్‌కెందు కొచ్చినట్టు? ఇవన్నీ ఎందుకు తెప్పించుకున్నట్టు? మగవాళ్ళకి మనస్సు, మాట రెండూ నిలకడగా ఉండవు.

''మేం కూడా వెళ్ళాలి!'' అంటూ గీత, గీత వెంట ఉష లేచారు.

## 9

సుధాకర్ పోస్టుమేనిచ్చిన కవరు తీసుకుని ఆత్రుతగా చింపాడు. అది మోహన్ వ్రాసిన ఉత్తరం అని తనకు తెలుసు. అందులో మనస్సుకు ఊరట కల్గించే విషయమేమైనా ఉన్నాయేమో.

''డియర్ సుధాకర్!

నీకు, కళకు పెళ్ళి జరిపిస్తానని నేను మాట ఇచ్చాను. ఏ సందర్భంలో కూడా నేనా మాట తప్పను. మీ ఇద్దరి పెళ్ళికి శతవిధాలా ప్రయత్నిస్తాను. ఈలోగా నువ్వు మీ నాన్నగారికి కళను చేసుకుంటానని చెప్పు. ఆయన రామయ్యగారికి ఉత్తరంరాస్తే ఏమని జవాబొస్తుందో చూడు. ఒకవేళ రామయ్యగారు కాదన్నా నువ్వు బెంగ పెట్టుకోకు. ఆయనకు తగ్గ ఎత్తులు నేను వెయ్యగలను......

నీ

మోహన్.''

మోహన్ ఉత్తరం చదివేసరికి సుధాకర్‌కు ఎక్కడలేని సత్తువ వచ్చినట్టయింది. మోహన్ పూనుకున్నాడంటే కళతో తన పెళ్ళి తప్పకుండా జరుగుతుంది. ఆ నమ్మకం తనకుంది.

మధ్యాహ్నం అందరి భోజనాలు పూర్తయ్యాక వంటిల్లు చక్కబెట్టుకుని సుధాకర్ తల్లి వాకిట్లో గుమ్మంమీద తలపెట్టుకుని ఆయాసంగా వాలబడింది. ఆవిడకి నలుగురు కొడుకులు, ముగ్గురు కూతుళ్ళు. అందర్లోకి సుధాకర్ చిన్నవాడు. సుధాకర్‌కి తప్ప అందరికీ పెళ్ళిళ్ళు జరిగాయి. పెద్ద కొడుకులు ముగ్గురూ వేరే ఊళ్ళలో ఉద్యోగాలు చేస్తున్నారు. కోడళ్ళు మంచి బుద్ధిమంతులు. అత్తమామల్ని అభిమానంగా చూస్తారు. అయినా సుధాకర్ ఒక్కడే హోటల్ తిండి తింటూ ఏం ఉంటాడు? వాడికోసం కొన్నాళ్ళు శ్రమపడక తప్పదు. వాడి కొక్కడా పెళ్ళి చేసేస్తే తను విశ్రాంతి తీసుకోవచ్చు. తను ఎక్కడఉన్నా వాడి నెవరు చూస్తారా అనే బెంగ ఉండదు.

సుధాకర్ మెల్లగావచ్చి తల్లి పక్కన కూర్చున్నాడు.

''ఏరా?'' అన్నది తల్లి ఆలోచనలోనుండి తేరుకుంటూ.

సుధాకర్ నేల మీద చేతో రాస్తూ "మద్రాస్ ఎంత బాగుంటుందమ్మా? నువ్వు రమ్మంటే రాలేదు కాని......'' అన్నాడు.

''నేనెలా వచ్చేదిరా? నువ్వు మీ నాన్నగారి స్నేహితు డింట్లో మకాం వేస్తే? ఆవిడ నాకు తెలుసునా ఏమన్నానా?......వాళ్ళమ్మాయిలు చక్కగా ఉంటారంట......నీకు ఒక్క పిల్లా నచ్చలేదట! ఇంకెవరినన్నా చూసుకురా. ఈ ఏడాది ఎలాగైనా నీ పెళ్ళి జరగాలి......ఇద్దరం పెద్దవాళ్ళం అయిపోయాం. ఏ క్షణంలో వెళ్ళిపోతామో చెప్పలేం. వెళ్ళేముందు నీ పెళ్ళి చూడాలి......''

— జవసత్వాలుడిగి నీరసంగా కనబడుతున్న తల్లి కళ్ళల్లో అంచలమైన ప్రేమ పొంగి పొరలుతున్నది. ఆ ప్రేమ వాహినిలో సుధాకర్ పిరికితనం కనబడని దూరానికి కొట్టుకుపోయింది.

''వాళ్ళ పెద్దమ్మాయి కళ చక్కగా ఉంటుందమ్మా. పైగా మంచిపిల్ల—''

''ఏదేమిటిరా?......ఆ అమ్మాయికి మేనరికం ఉన్నదట.'' అంటూ పక్కకు వత్తిగిల్లింది తల్లి.

రెండు రోజులక్రితం రామయ్యగారి దగ్గర నుంచి ఉత్తరం వచ్చింది. పెద్దమ్మాయికి మేనరికం ఉన్నదని, ఆ అమ్మాయితోపాటే రెండో పిల్ల పెళ్ళి కూడా చెయ్యాలని ఉందని, అయినా భగవత్కృప ఎలా ఉన్నదో అని వ్రాశారాయన గడుసుగా, మాటిగా పెళ్ళిమాట ఎత్తకుండా. ఆడపిల్లనుకన్న తండ్రికి అంత గడుసుతనం పనికి రాదనుకుంది ఆవిడ......అతను ఖచ్చితంగా అడగనంతవరకు సుధాకర్ దగ్గర ఆ మాట ఎత్తకూడదనుకుంది.

''మరి ఆ సంగతి నాకు ముందే ఎందుకు చెప్పలేదు?'' అంటూ సుధాకర్ దూకుడుగా లేచాడు.

తల్లి తెల్లబోయింది.

''ఉంటే ఉన్నది లేరా....ఈ రోజుల్లో మేనరికం ఎవరు చేసుకుంటున్నారు? మీ నాన్నగారిని ఉత్తరం రాయమంటానులే!''

సుధాకర్ చల్లబడి అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

పాపం! వాడికి ఆ అమ్మాయిమీద ఎంత ప్రేమో అనుకున్నది తల్లి......

వీలు చూసుకుని తల్లి సుధాకర్ సంగతి భర్త చెవిని వేసింది. ఆయన కసురుకున్నాడు.

''వాడేమో పెద్దపిల్లకి మేనరికం ఉందని ఖచ్చితంగా రాస్తే ఇప్పుడు నేను మా అబ్బాయికి ఆ పిల్లే నచ్చిందని రాయమంటావా?''

సుధాకర్ తల్లి మెల్లిగా సర్దిచెప్పింది.

''ఈ రోజుల్లో మేనరికం చేసుకుంటున్నదెవరు? మీ స్నేహితుడికి చేసుకోవాలని ఉన్న ఆ అబ్బాయి తలావుతాడో, లేదో? పెద్ద పిల్లనిస్తే సుధాకర్‌కు చేసుకుంటామని రాయండి...... మనవాడు అల్లుడు కావటమే అదృష్టం....నిక్షేపంలా ఒప్పుకుంటాడు......''

ఆగ్రహం తగ్గాక సుధాకర్ నాన్నగారు పెళ్ళాం చెప్పినట్టు రామయ్యగారికి ఉత్తరంవ్రాసి పడేశారు. ఆ ఉత్తరానికి జవాబు ఏం వస్తుందో అని సుధాకర్ గుండెలు బిగబట్టుకుని కూర్చున్నాడు.

**(సశేషం)**



"ఏమండోయ్! మా గాలిపటం చిక్కడిపోయింది. కొంచెం విప్పిపెడతారా?"

# అతి తేలిక

# మీకు

# కావలసిందల్లా




# మాత్రమే

## నేషనల్ అండ్ గ్రిండ్లేస్‌లో

## సేవింగ్స్ బ్యాంక్ అకౌంట్

ప్రారంభించడానికి



బ్యాంక్ ఛార్జీలు లేవు - పైగా సాలీనా నూటికి రు. 3/-లు వడ్డీకూడా మీకు లభిస్తుంది.

నేడే మీకు సమీపంలోవున్న బ్రాంచికి వెళ్లండి:

**నేషనల్ అండ్ గ్రిండ్లేస్ బ్యాంక్ లిమిటెడ్**

(యునైటెడ్ కింగ్‌డమ్‌లో ఇన్‌కార్పొరేట్ చేయబడింది. మెంబర్ల బాధ్యత పరిమితం). NGB/AI TEL

బ్రాంచీలు: మద్రాసు: 3, నార్త్ బీచ్ రోడ్డు: 378 నేతాజీ సుభాష్ చంద్రబోస్ రోడ్డు, (సౌకార్స్ బ్రాంచి); 6, ఆర్మీనియన్ స్ట్రీట్: 158, మౌంట్ రోడ్డు. హైదరాబాద్: అబిడ్ రోడ్.

చెయ్యవద్దని వార్నింగ్ ఇస్తే—మళ్ళీ చెప్తానా? అయినా జారిపడటం కీజు డబ్బివ్వటం నాదే తప్పు.

మౌనంగా ఆయన మాటలన్నీ విన్నాను. ఎదురు చెప్పటం నా చేతకాని పని. వారు చెప్పిపెట్టినంతవరకూ కానిచ్చి తర్వాత నెమ్మదైన స్వరాన "చూడు నాయనా! ఆ పిల్ల ఏదో గుట్టుగా బతుకుతున్నది. ఇట్లా రచ్చకీడిస్తే మనకు ఒరిగే లాభమేముంది? దిక్కులేని వాళ్ళమీద, దరిద్రుల మీద నిస్సహాయులమీద ఇట్లా ప్రయోగాలు చేసినందువల్ల గొప్పతనం వస్తుందా?" అన్నాడు.

"రాదు! రాదు!" నాకు నేనే చెప్పుకున్నాను.

"నీ మంచితనంమీద నాకు నమ్మకం ఉంది. ఈ నమ్మకాన్ని నమ్మకంగానే ఉంచుతానని మాటియ్యి!" అన్నాడు చెయిచాచుతూ. యాంత్రికంగాను చెయ్యి ఆయన చేతిలో పడింది. "అలాగే" అన్పించింది ఏదో శక్తి నా చాత.

అరగంటసేపు ఆయన లెక్చరే సరిపోయింది. బయటికివచ్చి, జేబులో రుమాలుతో మ. ఖానికి పట్టిన చెమట తుడుచుని స్టాఫ్ రూములోకి రాగానే సూర్యావర్తం మాస్టరు ఇందాకటిలా నవ్వుతూ, "అదృష్టవంతుడివి గురూ! వెయ్యవలసినచోట పాగా వేశావు. మొదట మొరాయింపులు తప్పవులే. తర్వాత అదే లొంగుతుంది."

అందరిసీ నమిలి మింగేయ్యాలన్నంత కసి ట్టింది. మనస్సును ఎవరో బల్లేలతో పొడుస్తున్న బాధ. అక్కడ వుండలేక, స్కూలు ముందున్న ఆట స్థలంలోకి వచ్చాను. ఎవరూ లేరు. చప్రాసీ ఒకడు గడ్డిమొక్కలన్నీ, రాతి ముక్కలను ఏరివేస్తున్నాడు. ఆ చివరనున్న వేప చెట్టు క్రిందకువెళ్ళి కూర్చున్నాను. చివరిగంటలో అయిదో తరగతి పిల్లలను అల్లరి చెయ్యకుండా కూర్చున్నవాళ్ళ నెక్కక్కళ్ళనే ఇళ్ళకు పంపించమని మానిటర్‌తో చెప్పి, తలనొప్పిగా ఉందని హెడ్మాస్టరు గారితోచెప్పి ఇంటికి వచ్చాను. నా వాలకం చూసి శారద ప్రశ్నలు వేసింది. తలనొప్పిలాంటి అబద్ధాలు సమయానికి పనికి వస్తాయి. ఇప్పుడూ పనికి వచ్చాయి. ఏవో వంటింటి వైద్యపు మాత్రలు మింగక తప్పలేదు—చెప్పిన అబద్ధానికి.

ప్రతిరోజూ సాయంత్రం రోడ్డువెంట నడకకు వెళ్ళటం ఇక్కడికి వచ్చాకనే అలవాటయింది. అయిదున్నరవరకూ తలంతా దిమ్ముగాండి అట్లాగే పడుకున్నాను. మాటి మాటికీ సూర్యావర్తం మాస్టరు అన్న మాటలే నన్ను వేధిస్తున్నాయి. నా వాలకం ఇట్లాగే ఉండటం సంభవిస్తే—శారద అజమాయిషీలో వైద్యాలూ, లంఖణాలూ, బుద్ధిపుట్టే భూతవైద్యాలూ తప్పవు. లేచి స్నానంచేసి బయల్దేరాను.

"త్వరగారండి! అసలే నలతగా ఉన్నారు" హెచ్చరిక బయల్దేరుతూనే.

మామూలుగా నడుస్తున్నాను. మలుపు...... గుడిసె......మధ్యాహ్నపు సంఘటన గుర్తుకు రాగానే నడక ఆపి హెచ్చించాను. అరుగుమీద కూర్చుని పలక మీద ఏవో వ్రాసుకుంటున్న కృష్ణ నన్ను చూసి లోపలకు వెళ్ళింది. నేను వీధి దాటేలోగా పరుగెత్తుకువచ్చి నన్ను కలుసుకుని "సార్! సార్!" అంది.

"ఏమిటి?" విసుగ్గా అన్నాను.

చిత్రమైనమొహంతో "మరే..... మరేమో అమ్మ

## రెండవమలుపు
(21 వ పేజీ తరువాయి)

రమ్మంది!" అన్నది.

ఆశ్చర్య పడ్డాను......అట్లాగే మొరాయిస్తుంది. అన్న సూర్యావర్తం మాటలు గుర్తొచ్చినయి. నిజమేనా కృష్ణతల్లి అటువంటిదేనా? పొద్దున ఏడుస్తున్న కృష్ణ మొహం కళ్ళలో మెదిలి బాధవ్పించింది. పొద్దున ఆ పిల్ల నటించలేదు. పిల్లలు అబద్ధాలూ, నాటకాలు ఆడలేరు. నేర్పినవాళ్ళు పక్కన లేకపోతే బయట పడతారు. ఇది నా స్వానుభవం.

"రాన్లే పో!" అనేసి వెనక్కి చూడకుండా వెళ్ళిపోయాను.

అలా వెళ్ళటం సముచిత మన్పించలేదు పిరికితనం. . . మొదటి నుంచీ నాలో ఈ పిరికితనమే ఉంది. అయినా ఒకవేళ ఆమె నన్ను సదుద్దేశ్యంతోనే పిల్పించిదేమో? నేనెందుకు అపోహ పడుతున్నాను?

ఎక్కువ దూరం నడవలేదు. నడవలేకపోయాను. ఆమెతో వెళ్ళి మాట్లాడాలనీ, ఇన్నాళ్ళుగా నేను చూడని ఆమెను చూడాలనీ, నేను చేసినదేం నేరం గాక పోయినా నా మీద వేసిన అభాండానికి సంజాయిషీ అడగాలన్న కాంక్ష — ఎక్కువయింది. తట్టుకోలేక వెనక్కి తిరిగి వచ్చాను. అక్కడికి రాగానే— మళ్ళీ ఏదో భయం. నేను లోపలకు వెళ్ళటం ఎవరయినా చూస్తే? అసలే పల్లెటూరు. ఇంత నిప్పు— గుప్పున అంటుకుంటుంది.

ఆ మలుపులోనే నిల్చుని తర్జన భర్జన చేసుకున్నా నొక పది నిముషాలు. పొద్దుగూకుతున్నది. గ్రామాల్లో అప్పటికే నరసంచారాలు తక్కువవుతాయి. పొలాల్లో నుంచి వచ్చిన శ్రామిక జీవులు హాయిగా పడుములు వాల్చేవేళ. ఇల్లాళ్ళు వంటా వడ్డనతో తీరికలేని వేళ.

ఎవరూ రావటం లేదు. వచ్చే సూచనలూ లేవు. లేని ధైర్యంతో ఇంటి ఒక్క మెట్టు ఎక్కాను. తలుపు దగ్గరకు వేసి ఉంది. ఇల్లు చీకటిగా ఉంటుందేమో — దీపం వెలిగి ఉంది. కుట్టుమిషను టకటక. . . అందులో పాపమాటలు.

"వారు మండుతున్నదే. . . ."

"మంచినీళ్ళు తాగు!"

"మొన్న కారమేను. నిన్న కారమే. . . ఇప్పుడు గూడా. . నే తిన్ను!"

"ఆకలయితే కడుపునొప్పి వస్తుంది— మొన్నటిలా. రేపు కరణం తాతగారి తోటలో ఏవన్నా తెచ్చి వండుతాలే!" ఆమె కంఠం.

"నేను విన్నదియితే, వాళ్ళమ్మ తిట్టింది!"

"వాళ్ళమ్మ కాదే మొద్దు! ఆయన భార్య!"

"భార్యంటే. . . ."

"నీ మొహం. తిను. . . ."

ఇంకెక్కువసేపు నిల్చుంటే, ఎవరయినా అటు వచ్చి చూస్తారు. ఈ రవ్వంత ఒగ్గు విప్పాకణికగా వారి ఇల్లంతా రాజుకుంటుందేమో! తలుపు తట్టాను. చెయ్యరాని పనేదో చేస్తున్నట్లు వణుకు పుట్టింది.

"ఎవరు? లోపలకు రండి. తలుపు తీసే ఉంది?"

తలుపు నెట్టుకుని లోపలకు వచ్చాను. నన్ను చూసి ఆమె గభాల్న నిల్చుని, నెత్తి మీదకు ముసుగు లాక్కుంది. కృష్ణకూడా నిల్చుంది. ఆ పిల్ల— తాటాకు చాప మీద కూర్చుని రొట్టె తింటున్నది. మిషనుకు, కంచానికి మధ్యనున్న దీపపు వెలుగులో— మిరపకాయలు కాల్చిన కారప్పొడి, రొట్టె అవుపిస్తున్నది.

"పిలిచారుట!" అన్నాను. కృష్ణ నావేపు చూసి, తల్లివేపు చూసింది. ఆమె నాకు పక్కవాటుగా నిల్చుంది. దీపానికి పైన ఉండటం వల్ల స్పష్టంగా ముఖం కన్పించటంలేదు.




"బాబూ! తమరు కరుణించాలి. ఆపరేషను చేస్తూ అబ్బాయి కడుపులో కత్తెర వొదిలేసి, దాన్ని తియ్యటానికి వందరూపాయలవుద్దంటే ఎల్లాగండి?..."

పాకెట్ ప్రెస్



పేర్లు, చిరునామాలు, ఉత్తరాలు, లేబెల్సు వగైరాలను దీని సహాయంతో ఇంట్లోనే చక్కగా ముద్రించుకొనవచ్చును. నెం. 1. రు. 2–75 లు. నెం.2. రు. 3-50లు. నెం.3. రు. 4-25 పై. స్పెషల్ రు. 5–50 లు. అత్యుత్తమమైనది. రు. 7–75లు. పోస్టేజి రు.1–95.

**AMERICAN STORE (KB-99)**
**265/12/1/C,**
**Gopal Lal Thakur Road, Calcutta-36.**

## పాదాలలో ఆనెలు

పాదాలలో ఆనెలు, కండలు పెరిగి, వ్రేళ్ళు పాతుకుపోయి పాదములు నేలపై బెట్టలేక రాళ్ళు తగిలిన తుళ్ళిపడువారు పైపూతగా వాడిన వ్రేళ్ళతో సహా మాయంచేయగల సంజీవి. వెల పోస్టు ఖర్చులతో రు.5–50 న.పై.

| | |
|---|---|
| కొక్కోకము చిత్రపటములు గలది. | రు. 1–50 |
| దాంపత్య రహస్యములు ... | రు. 3–00 |
| తెలుగు హిందీ స్వయంశిక్ష | రు. 4–50 |
| తెలుగు–ఆంగ్ల భాషాబోధిని | రు. 5–00 |

పోస్టు ఖర్చులు ప్రత్యేకము.

**ప్రభ అండ్ కో.**

**3, మలయపెరుమాళ్ వీధి, మద్రాసు-1.**

## అతిమూత్ర రోగులందరికీ ఉచిత సలహా

మూత్రము ద్వారా చక్కెర వెలువడుట "మెల్లిటస్" అతిమూత్రవ్యాధి, (Diabetes Mellitus) చక్కెరలేకుండ తరచుగా మూత్ర విసర్జన జరుగుట "ఇన్‌సిపిడస్" అతిమూత్రవ్యాధి (Diabetes Insipidus) అనబడును. అమిత ఆకలి, దాహము, శరీరమంతా పోట్లు, బరువు తగ్గిపోవుట ఈ వ్యాధి యొక్క ముఖ్య చిహ్నములు. ఇవిగాక, చర్మవ్యాధులు, దురద, మూత్రకోశము, కాలేయము బలహీనమగుట మున్నగునవి గూడ పొడసూపవచ్చును. వీటికి వెంటనే తగుచర్య తీసికొనకున్నచో దృష్టిమాంద్యము. నిద్రలేమి, కీళ్లవాతము, మానసిక శారీరక శ్రమలయందు అయిష్టత మున్నగువాటికి దారి తీయ వచ్చును. ఇటువంటి లక్షణములతో బాధపడుచున్న రోగులు, ఇన్‌జెక్షన్లు, కఠిన పథ్యములు, ఉపవాసములు లేకుండ తమ వ్యాధిని నివారణ చేసుకొనుటకు తగిన ఉచిత వైద్యసలహా కొరకు మాకు వ్రాయవచ్చును. మించిపోకముందే మాకు వ్రాయండి.

**VENUS LABORATCRIES (A' M.)**
**P. O. Box No. 587 Calcutta-1.**


# రెండవ మలుపు

"అవును! క్షమాపణ చెప్పుకుందామని ?"

"ఎందుకు ? క్షమించండి. నేనే ఆ పని చెయ్యాలి. ఒకటి నిజం. నేను దురుద్దేశ్యంతో పాపకు జీతం చెల్లించలేదు. పసిపిల్ల కోసం ఏదన్నా చేస్తున్నప్పుడు, దురుద్దేశ్యంతో చేసేటంత పిచత్వం నాకులేదు !"

"నాకు తెలుసు !" దృఢమైన స్వరం ఆమెది.

"తెలుసా ?" ఎలా తెలుసో నాకు తెలియలేదు.

"ఆ ! మధ్యాహ్నం పూట పాపకిస్తే మళ్ళీ డబ్బు పారేస్తుందని నేనే ఫీజుకట్టాలని వచ్చాను. విశాలాక్షి గారు మీరు కట్టేసినట్లు చెప్పారు. అందుకు నేనేమీ అనుకోలేదు. కాని— వెనక ఎవరో— గాలి విసుర్లు విసిరారు. . . నటించక తప్పలేదు."

"సూర్యావర్తం పట్టి పోటి దురుసు. . ."

"అయినా, కాకున్నా మామూలుగా ఉంటే అదే ఓ భాగ్యం, లేనిపోని ప్రచారాలు జరుగుతాయి. నా ఉనికిని గూర్చి నాకే భయములేదు. ఇదంతా మీ కోసమే. . . మీ మంచికోసమే ?. . ."

"నా మంచికోసమా ?"

"అవును ! అనూయకురాలయిన మీ శారద, నాలుగేళ్ళు నిండని మీ చిట్టితల్లి. . ."

"ఓహో ! చాలు.." ఎందుకో ఆవేశ పడ్డాను— నాకే తెలియదు. రెండు నిముషాలు స్తబ్దంగా గడిచాయి. కృష్ణకిదేమీ అర్థం కావటం లేదు. అసలు నాకంటే గదా ? ఆమే మళ్ళీ అంది. "వెళ్ళండి ? వెళ్ళండి ! ఎవరన్నా చూస్తే విష ఫలితాలు కలగవచ్చు. ఇది చెప్పటానికే పిలిపించాను. కనీసం మీరయినా సుఖపడితే నేను సంతోషిస్తాను. ఒకసారి చేసిన అపకారానికి పడిన శిక్ష చాలు. నేను మీ శ్రేయోభిలాషినే. నా పాప సాక్షి. . . నేను మీ శ్రేయోభిలాషినే ఆమె గొంతు గుద్గికమైంది. మాట పెగులలేదు.

శ్రేయోభిలాషి, శిక్ష, అపకారం— నాకేమీ తలకెక్కలేదు. ఆమె అంటూంది. "వెళ్ళండి ! పళ్ళి పోండి మాస్టారూ !. . ."

పిలిచినప్పుడు రావటానికి, పొమ్మంటే పోవడానికి కనీసం చేతిలో కీలుబొమ్మనా? అసలెవరు నాతో ఎందుకిలా మాట్లాడుతున్నది ? నా మాటలు నా నోటి నుంచి బయటికి వచ్చినట్లు నీకు సరిగా తెలియదు. ఆమె జవాబును బట్టే తెలుసుకోవటం.

"గుర్తిస్తే బాధపడతారు. పాపకు మీ పేరే పెట్టుకున్నాను. నా ముఖన్ని చూడాలని అనుకుంటున్నారా ?"

"ఆ ! ఆ !"

"కృష్ణ పోలికల్లో మీకు వసూ— కన్పించటం లేదా ?"

ఈడ్చి మొహం మీద బాదినట్లయింది. ఆ మాట వినగానే ఏదో ఆవేశం. ఆమె చెయి పట్టుకుని నా వేపు తిప్పుకున్నాను. ముసుగు జారిపోయింది. కృష్ణ భయంతో తల్లిని కౌగిలించుకుంది. ముఖం మీద పడిన వెలుగు— వసుంధరనే చూపించింది.

"వసున్ధరేనా?" వెనక్కి వేసిన అడుగుల్లో తలుపు కొనుక్కున్నాను. అంతే అనుకొన్నట్లు వసు ఎక్కడో సుఖపడటం లేదన్న మాట ! నా స్వర్గం లోనే— నా వెనుకే కంటకాలు గుచ్చుకున్న దేహంతో పడుతూ లేస్తూ పయనిస్తున్నది. . . లోకంలో అనుశ్రుతమైన మోసం వస్తూనట్లు గూడా. . దిప్పుడా. . .

"నువ్వు... నువ్వా... మోసపోయావా? వసూ!"

జరిగిన నిజానికి సాక్ష్యులుగా మెరుస్తున్న రెండశ్రుబిందువులు బుగ్గల మీదుగా జారి, మరో ప్రత్యక్ష సాక్షి— కృష్ణ తల మీద పడ్డాయి.

అక్కడ ఒక్క క్షణం గూడ ఉండలేక పోయాను. శరీరమంతా సూనెలో వేసి కాలుస్తున్నట్లుంది. గుండెను కోస్తున్న కత్తిలాంటి భావం. మస్తిష్కంలో విరిగిన జ్ఞాపకాల ముల్లు కలుక్కుమంది. అంతర్యంలో గాయం కదిలింది.

*  *  *

వసుంధర పతనానికి బాధ్యత నాదే. ఆరోజుల్లో ఎన్నోసార్లు తన అంతర్యాన్ని నాకు బోధపరచాలని చూసింది. స్త్రీ కనుక తనయి తాను అడుగలేకపోయింది. అర్థమయినా— మిన్నకుండా పూరుకున్నాను. ఆమె అన్నట్లు ఏ దుష్పరితాలకు బాధ్యత వహిస్తుందో నన్న భయంచేత, తొందరపడి పెళ్ళాడితే రెండు జీవితాల సమస్యయంతో ఏ అజనపు భారాన్ని వహించి నడువను వీగాట్టు కొంటా వోనని మనసులో మాటకు వాయిదా వేయించాను.

వసు ఉద్విగ్న తత్త్వం గలదని తెలిసే, ప్రేమ పేరుతో ఆమెకు ఆశలు కల్పించాను. పిరికితనానికి మారు పేరును, సంస్కారాన్ని, అడ్డంగా ఆమె ప్రణయానికి ప్రతిస్పందనలేక నేను ప్రవర్తించాను. ఆమె ప్రేమ, ప్రణయమూ, అన్నీ అంటే, నాలోని బలహీనతలన్నీ గాలిలయ్యాయి. దావగ్ని రగుల్కుంది.

నేను చటుక్కు పడక పోయినా వసు— ఎక్కడో సుఖంగా జీవిస్తూ వుండేదేమో ? ఆమెను అన్ని విధాలా పాతాళానికి తీసుకెళ్ళింది నేనే.... నేనే....

"నువ్వే.... అంతరాత్మ అరిచింది. ఏం చెయ్యను.... దీనికి ప్రాయశ్చిత్తం ఏం చెయ్యను? అన్ని ప్రశ్నకు— ఏడవమన్న జవాబు.... మిగిలింది అదే. చేసిన అన్యాయానికి ఏడవటం కన్నా మిగిలిందేముంది ?

నేను వచ్చానని, గదిలోకి రెండవ దీపాన్ని వెలిగించి తెచ్చింది శారద. నన్ను చూసి "తల నొప్పి తగ్గలేదూ ? అట్లా ఉన్నారేం ?" అంది.

"ఏమీ లేదు ?"

"ఏం లేక పోవటమేమిటి ?.... అంటూ దీపాన్ని ముక్కాలి పీటమీద పెట్టి నా వేపు చూసి ఆశ్చర్యపడి "ఆ కన్నీళ్ళేమిటి ?" అంది.

తడుముకున్నాను. చేతికి తడితగిలింది. ఏం జవాబు చెప్పాలో తోచలేదు. నిజం చెప్పే ధైర్యం, సమర్థత నాకులేదు. ఎదురుగా, ముప్పయ్యేళ్ళ నాడు నన్ను కని మరణించిన అమ్మ ఫోటో అక్షపించింది. నేను స్వయంగా చూడని ఆమెను తల్చుకుని ఎన్నడూ కంట తడిపెట్టక పోయినా—

"అమ్మ గుర్తుకు వచ్చింది !" అన్నాను.

శారద తెల్లమొహం వేసి నన్ను చూస్తున్నది! ★

# వాటర్‌బరీస్ కాంపౌండ్
ఎఱ్ఱ లేబిలు

# త్రాగి జలుబును ఎదుర్కొండి






మామూలుదని భావించే జలుబు మీలోని రోగమును ఎదుర్కొనే శక్తిని పోగొట్టుతుంది. దేహమును బలహీన పరచి రోగములు కలిగే అవకాశమును కలిగిస్తుంది. వాటర్‌బరీస్ కాంపౌండ్ యొక్క విశిష్టమైన త్రివిధ క్రియ ఉపశమనమును కలిగిస్తుంది, మళ్లీ సత్తువనిస్తుంది మరియు రోగనిరోధక శక్తిని హెచ్చుచేస్తుంది. దానిలోని చురుకుగా పనిచేసే క్రియోసోట్ మరియు గయెకోల్ జలుబునుండి ఉపశమనము కలిగించును; దానిలో చేరే ఇనుముయొక్క సత్తువ మరియు బలవర్ధక పదార్థములు, మాల్ట్ మరియు ప్లీహ సారములు ఆకలిని పుట్టించును, కోల్పోయిన శక్తిని భర్తీచేయును, రోగము మళ్లీ రాకుండా ఉండేలా రోగనిరోధక శక్తిని కలిగించును.

ఏ శీతోష్ణస్థితిలోనైనా రోగనిరోధక శక్తికి ఎఱ్ఱ లేబిలు గల వాటర్‌బరీస్ కాంపౌండ్ త్రాగండి.





వాటర్‌బరీస్ కాంపౌండ్‌లోగల క్రియోసోట్ మరియు గయెకోల్ కఫమును విడదీసి ఉమ్మిలో పోయేలా చేయును మరియు పుళ్లను అడ్డును. అవి ఊపిరితిత్తులను శుభ్ర పరచును, దగ్గు, జలుబు, ఉబ్బసపు అసౌఖ్యము, శ్వాస నాళపు అస్వస్థతలను పోగొట్టుటలో సహకరించును మరియు రోగములు మళ్లీ రాకుండా చేయును.

# వాటర్‌బరీస్ కాంపౌండ్

## దగ్గు, జలుబు, శ్వాసనాళపు అస్వస్థతలు, ఉబ్బసపు అసౌఖ్యములను నివారించుటకు శక్తిని కలిగించును

వార్నర్-హిందూస్తాన్ లిమిటెడ్, బొంబాయి

ఇన్నిమాటలు అన్నప్పుడు బావ ఏమనుకుంటాడో ? సుభద్ర ఏమనుకుంటుంది. నిన్న మొన్నటివరకూ ఏ దిగులూ, చింతా లేని నా జీవితం ఈ రోజున ఇట్లా ఈవిధంగా అపనిందల పాలయింది. నా మూర్ఖత్వమే కారణమా ? ఇందులో మూర్ఖత్వం మాత్రం ఏముంది. ఎంతమంది సంబంధాలు వెతకటంలేదు. చూసిన సంబంధాలన్నీ చేసుకుంటున్నారా ! సంబంధం కాదనుకుంటే అపవాదులు భరించవలసిందేనా ? అసలీ ప్రేమలు ఎట్లా కలుగుతాయి ? మానసిక పరివర్తనమంచా ? శారీరక సౌఖ్యాలను ఆశించా ? లౌకిక ప్రలోభాలకు లోబడి ప్రేమిస్తున్నారా ? గృహస్థాశ్రమం స్వీకరించటానికి ప్రేమిస్తున్నారా ? పిల్లల్ని కని, పెంచి, పెద్దవాళ్లను చెయ్యటానికి ప్రేమిస్తున్నారా ? మానవసేవ, మాధవసేవ, చెయ్యటానికి పెళ్ళి చేసుకుంటే సరిగా నిర్వహించుకోలేమా ? భర్తకు సేవ చెయ్యటమే ఆడదాని జీవిత పరమావధిగా పెద్దలు నిర్దేశించారా ? మానవసేవ చెయ్యటం జీవిత పరమావధి ఎందుకు కాకూడదు ! మానవసేవే మాధవసేవగా భావించి తరించినవారు లేరా ?

ఏమిటో ? నా ఆలోచనలకు అంతులేకపోయింది ఆరోజు శనివారం. స్వామి దర్శనం కోసం ప్రమీల యింటికి వెళ్లాను. జనం చాలామంది వచ్చారు. అంతా ప్రశ్నలడుగుతున్నారు. నేను రెండు ప్రశ్నలడిగాను నమ్మినవారికి స్వామి ఉన్నాడు. ఇదంతా అమ్మకూ నాన్నకూ చెప్పాను. అమ్మా, నాన్నా వెళ్ళి స్వామిని దర్శించి వచ్చారు. స్వామి లీలలు వాళ్ళకూ ఆశ్చర్యం కలిగించి నయ్యి. ఇంటికి వచ్చాక నాన్న అన్నారు: ''సీతా ! అంతా స్వామిదయ. ఇంక ఆలోచనలతో మనస్సు పాడుచేసుకోక చక్కగా చదువుకో తల్లీ. ఈ ఏడు పి. యు. సి. క్లాసుతో ప్యాసయితే నాకదే పదివేలు. నువ్వు నాకు కూతురవు కాదు. కొడుకువి. జానకి మాకు కూతురు. దాని దారిన అది పోయింది. అమ్మ కన్నకడుపు కనక అట్లా అంటుందే అనుకో. అందుకు మనస్సులో బాధపడకు తల్లీ. ఇంక పెళ్ళి విషయం ఎప్పుడూ తీసుకురాను సీతా'' అని నాన్న కళ్ళు తుడ్చుకున్నాడు. అమ్మ కూడా ఏమీ అనలేదు.

కాలేజీకి వెళ్ళాను. ప్రమీల అడిగింది ''నీ జీవితం ఏమిటో నా కిప్పుడు అర్థమైంది సీతా ! మీ నాన్నగారన్నట్లు చదువు పైన నీ మనస్సు మళ్ళించు, కనీసం మీ నాన్నగారయినా నీ మనస్సు గ్రహించట మనేది నిజంగా నీ అదృష్టమే. అందరి తండ్రులూ మీ నాన్నగారంత ఉత్తములుగా ఉండరు. అన్నింటినీ మించి దయ నీ మీద పూర్తిగా ఉన్నది'' అన్నది ప్రమీల.

* * *

మరో వారం పదిరోజులు గడిచినయ్యి. శుభలేఖ వచ్చింది. హరినాథ్ తో సుభద్ర పెళ్ళి. శుభలేఖ చూసేసరికి నా కళ్ళు చమర్చినయ్యి. బావపెళ్ళి విషయం ఏమయినట్లు ? మరే పిల్లనీ పెళ్ళి చేసుకోటానికి ఇష్టపడలేదా ? నన్నే చేసుకోవాలనే పట్టుదలతో ఉన్నారా ! నన్ను కాకపోతే మరెవరినీ చేసుకోటానికి ఇష్టపడలేదన్న మాట. బాబుకి తల్లి కాదగిన వాళ్ళు నేనుతప్ప ఎవ్వరూ లేరా !

## హృదయ కుసుమాలు

తనూ అట్లాగే ఉండిపోవాలనుకున్నారా ? ఇదంతా నానుంచేగా ? స్వామి నా కోరిక తీరుతుందన్నారే? నా ప్రశ్నలకు స్వామి స్లేట్ 'ఆ' అనే రాసింటే! ఏమిటో సమస్యలు. అసలు నేను లేకపోతే ఏ సమస్య ఎవరికీ ఉండవేమో ? అనుకున్నాను.

* * *

నాలుగు రోజులు శలవుపెట్టి సుభద్ర పెళ్ళికి వెళ్ళాను. అమ్మా నాన్నా పెళ్లికిరాలేదు.. కూతురు పోయి సంవత్సరమయినా కాకపోవటం ఒకటి. రెండోది వాళ్ళకోరిక ప్రకారం బావను పెళ్ళి చేసుకోటానికి నేను ఇష్టపడక పోవటం.

హరినాథ్ చాలా బావున్నాడు. సుభద్రకు తగినవాడే. ఇద్దరూ చాలా అదృష్టవంతులు. వారు ప్రేమించి పెళ్ళి చేసుకున్నారంటే నాటికి


ఆహ్వానము

ప్రతి సంవత్సరం అసంఖ్యాక భక్తకోటిని ఆకర్షించే!

* బిక్కవోలు షష్ఠి *

ది 10-12-64 సం॥రం తేదీ గురువారం * శ్రీ కుమార వేంకట సుబ్రహ్మణ్యేశ్వర స్వామి వారిని దర్శించి తీర్థప్రసాదములు స్వీకరించి తరించవలసిన పర్వదినం *

అందరనూ ఆకర్షించే వినూత్న కార్యక్రమములు

శ్రీ కుమార వేంకటసుబ్రహ్మణ్యేశ్వరస్వామివారి షష్ఠి మహోత్సవములు

బిక్కవోలు. తూ॥గో॥జిల్లా, ఆంధ్రప్రదేశ్

'లిలో' యాంటిలైస్ హెరాయిల్ మిక్స్

'లిలో' వాడి తలలోని పేలు, ఈళ్ళ బాధనుండి విముక్తి కండి!

'లిలో' నాగరిక ప్రపంచములో ఒక ప్రత్యేక పరిశోధన.

అనేక వనమూలికల సమ్మేళనం

మీ కేశములు ఆరోగ్యవంతముగా వుండుటకు మార్గదర్శి అయిన ఒక్క 'లిలో' యాంటిలైస్ హెరాయిల్ మిక్స్ వల్ల మీరు అనేక సదుపాయములు పొందకలుగుతారని పరిశోధనలవల్ల రుజువైనది

★ తలలోని పేలను, ఈళ్ళను నాశనం చేస్తుంది.

★ చుండ్రు పట్టనివ్వదు.

★ కేశములను గట్టిపరచి ఏపుగా ఎదుగుటకు ఉపయోగపడును.

★ మరింత స్వచ్ఛమయిన నల్లదనం మీ కేశములకు ఏర్పడుతుంది.

'లిలో' ప్రతి నిత్యము మీరు వాడే తలనూనెలో కలిపి వాడడం మొదలు పెట్టండి. తలలో వేరే క్రిముల బారినుండి రక్షింపబడి మీరు సంపూర్ణ ఆనందం పొందకలుగుతారు.

టయిల్ సైజు సీసా రు. 1-50. అన్ని షాపులలోను దొరకును.

సోల్ డిస్ట్రిబ్యూటర్స్:

పద్మా ట్రేడింగ్ కంపెనీ,

5-2-68/4, జామ్‌బాగ్ రోడ్, హైదరాబాద్-1

(KUCHI)

# హృదయ కుసుమాలు

[illegible]

పెళ్ళికి రమాదేవి వచ్చింది. పెళ్ళిలో బావ కనుపించినా నన్ను పలకరించటానికి మనస్కరించక తప్పుకు తిరుగుతున్నారు. ఎప్పుడు కనిపించినా బాబుని ఎత్తుకునే కనిపించేవారు. నాతో గాని, రమాదేవితో గాని మాట్లాడలేరు. పిలుస్తున్నా ఉల్లా రమాదేవి మాత్రం బాబుని ఎత్తుకుని వాడి పన్నస్ని చేసేది. రమాదేవి ఎత్తుకుంటే వాడూ నవ్వుతూ ఊరుకునేవాడు.

పెళ్ళయింది. పెళ్ళివారు మగ్గాణ్ణిదలకు వెళ్ళారు. చుట్టాలంతా ఉన్నారు. అందులో కొంత మంది బావవైపు చూస్తూ "ఈ పిల్లేగా జానకి చెల్లెలు. మన రామారావుకి చేసుకోకూడదూ" అని బావ తల్లితో అన్నారు. ఆవిడ ఏం సమాధానం చెప్పేదో నాకు వినబడేదికాదు.

పెళ్ళికి ఆ ఇల్లు చాలక మేడమీద వాటా కూడా తీసుకున్నారు. బావ, బాబుని ఎత్తుకుని మేడ మీద గదిలో కూర్చున్నారు. పెళ్ళిగా బావ ఉన్న గదిలోకి వెళ్ళాను. నన్ను చూసి ఏం మాట్లాడ లేదు. నేనే బావను పలకరించాను.

"కులాసాగా ఉన్నావా బావా. బాబు ఏమంటు న్నాడు" అన్నాను.

"కులాసానే. ఈ రోజుల్లో, ఎవరి ఆరోగ్యం వాళ్ళు కాపాడుకోకపోతే ఇంకొకళ్ళు మన ఆరోగ్యం గురించి శ్రద్ధ తీసుకోరుగదా. ఏదో ఇట్లా కాల క్షేపం చేస్తున్నాం" ముఖావకంగానే అన్నారు బావ.

"బాబు అల్లరిచేస్తున్నాడా ఎత్తుకుని తిప్పు తున్నారు"

"తప్పించుకునే వాళ్ళకి తప్పుతుంది గాని కన్న తల్లి దండ్రులకు తప్పదుగా."

"బావా. నా నిర్ణయం నీకు కోపం కలిగించింది కదూ. నా మీద కోపమొచ్చింది కదూ."

"నీ మీద నాకు కోపమెందుకు సీతా. నువ్వేం చేశావని. కారణం ఉండి గాని, కారణం లేకగాని ఒక భర్త భార్యని ఏడిపించి పేరు తెచ్చుకుంటే ఇంక ఆ వచ్చిన పేరు చచ్చినా పోదు. 'బ్రతికున్నన్నాళ్ళు ఆ పెళ్ళాన్ని కాల్చుకు తిన్నాడు. ఆ వచ్చేది మాత్రం ఏం సుఖపడుతుంది' అని తప్ప కుండా అంటారు. పరాయివాళ్ళే అట్లా అను కున్నప్పుడు అన్నీ తెల్సి పెళ్ళి చేసుకోబోయే పిల్ల ఆ పెళ్ళికి ఎందుకు ఒప్పుకుంటుంది"

బావ మనస్సులో బాధ పడుతూ ఉద్రేక పూరి తంగా మాట్లాడారు. ఆయన మనస్సులో నిరాశ పేరుకు పోయింది. ముఖంలో విచారం తిష్ట వేసింది. మాటల్లో సంఘర్షణ వ్యక్తమవుతుంది.

"నీ మీద కోపం చేత నేను పెళ్ళికి ఇష్టపడక పోలేదు బావా."

"రెండో పెళ్ళివాడు నా కెందు కనుకున్నావా"

"నా కసలా ఊహాలే తట్టలేదు."

"మరి"

"అక్కయ్య ఎప్పుడయినా నీకు కల్లో కనిపిం చేదా బావా."

"ఇప్పుడా విషయం ఎందుకు"

"ఏమీ లేదు. అడుగుతున్నాను."

"చాలాసార్లు కనిపించింది."

"ఏం చెప్పేది"

"నన్ను పిచ్చివాడిగా భావిస్తున్నావా సీతా."

"బావా. మనస్ఫూర్తిగా నీ మీదే నా కేటు వంటి దురభిప్రాయమూ లేదు. పెళ్ళికి ఇష్టపడక పోవటానికి, వ్యక్తిగత విషయానికీ ఏమీ సంబంధం లేదు. చెప్పుబావా, అక్కయ్య ఏమనేది"

"ఏమీ అనేది కాదు. దిగులుగా, జాలిగా నా వైపు చూసేది. బాబుని జాగ్రత్తగా కాపాడు కోండి అనేది. ఎప్పుడూ కనిపిస్తున్నట్టే ఉండేది. నవనీతం లాంటి జానకి మనస్సుని కష్టపెట్టాను. నా జానకిని నేను నిజంగా చంపుకున్నాను. నేను పాపాత్ముణ్ణి. ఆ ఫలితం అనుభవిస్తూనే ఉన్నాను. నాకు ఈ శాస్తి కావలసిందే."

బావ కళ్ళల్లో నీళ్ళు తిరిగినయ్యి. బావ మనస్సు ఇంత సున్నితమైందని, పశ్చాత్తాపంతో కుమిలి పోతున్నదని అర్థం చేసుకున్నాను. ఇంత సహృదయుడైన బావ అక్కయ్య విషయంలో అంత కాఠిన్యం ఎందుకు చూపాడో నాకు అర్థం కాలేదు. అది అక్కయ్య ముఖారవిందమేమో !

"ఎవరి ఆయుర్దాయానికి ఎవరు కర్తలు బావా"

"కాదు సీతా, జానకిని నిజంగానే ఏడిపించాను. నే చేసిన తప్పుకు నాకు నిష్కృతి లేదు. కాని సీతా, పశ్చాత్తాపంతో కుమిలి పోయేవాడికి ఏదో పెన్నిధి దొరికిందని సంతోషపడే సమయంలో, ఆ పెన్నిధి కాస్తా చెయ్యిజారి పోతే ఇంక అంతకన్న రంపపుకోత ఏముంది సీతా. నిన్ను పూర్తిగా నా హృద యంలో నింపుకున్నాను. జానకి జీవితాలు నువ్వు తీర్చగలవని ఆశించాను. నా ఇంట దీపం పెట్టి బాబుకి తల్లి లోటు తీర్చగలవని ఆశించాను. అనేక ఊహాలతో మనసారా నిన్ను నా దాన్నిగా చేసుకోవాలనుకున్నాను. నా బోటి అదృష్టహీనుడికి నువ్వు నగనకుసుమానివే కాని హృదయకుసుమా నివి కావని ఇప్పుడు తెల్సుకున్నాను. అపును సరి. అక్కను సుఖపెట్టలేని వాడిని చెల్లెల్ని సుఖపెట్ట గలనని నమ్మక మేముంది" అన్నారు బావ.

ఈ మాటలకు నేను తలవంచుకున్నాను. అభి మానంతో కుమిలిపోయాను. మనస్సులో కాలు చీకట్లు తారాడాగా అలుముకు పోయినయ్యి. బావ తన జీవితపు పుటలు విప్పి నాకు చదివి వినిపి స్తుంటే నా హృదయం విచారంతో కుమిలి పోయింది. బావను ఎందుకు చేసుకోకూడదు. ఈ రోజున అంగీకారం తెలిపినా, హర్షమోదాలతో, అత్యంత సంతోషంతో నన్ను స్వీకరిస్తారు. అందరి మనస్సుల్లో, హృదయాల్లో కారుచీకట్లు పోయి దేదీప్యమైన వెలుగు వెలుగుతుంది. అందరి కష్టాలూ గట్టెక్కుతయ్యి. ఇంత చెయ్యాలంటే ఒక్క వ్యక్తికి ద్రోహం చెయ్యాలి. ఒక్క ప్రాణి హృద యం ఆక్రోసింప చెయ్యాలి. దగ్గరలో ఉన్న వెల లేని మాణిక్యాన్ని అంతా ములకనగానే చూస్తు న్నారు. కళ్ళు కట్టుకుని ఆ మాణిక్యాన్ని స్వీకరించే తరుణం ఇంకా రాలేదా ?

బావ, బాబుని ముద్దు పెట్టుకుని, వాడ్ని కవ్వించి నవ్విస్తున్నారు. అరచేతుల్లో పడుకో బెట్టుకుని వాడి పొట్టని ముద్దు పెట్టుకుంటే వాడా చక్కిలిగిలికి, పొట్టనెప్పి పుట్టేటట్లు నవ్వు తున్నాడు.

"రమాదేవి బాగా చదువుతోందా బావా. ఈ ఏటితో చదువు ఆపేస్తుందా ?"

"నాకేం తెల్సు"



"వాళ్ళ క్లాసుకు మీరు వెళ్ళరా"

"వెళతాను. పాఠం చెపుతాను. చదువుకుంటే వాళ్ళే బాగు పడతారు. లేకపోతే లేదు. అంతకు మించి నాకేం తెలీదు."

"రమాదేవి రోజూ మీ ఇంటికి వస్తూంటుం దిగా. బాబంటే ఎంతో అపేక్ష. ఉన్నంత సేపూ వాడ్ని ఎత్తుకునే ఉంటుంది. సరేగాని బావా, రమాదేవితో ఇదివరకు మాదిరి మాట్లాట్టం లేదేం" అన్నాను.

బావ కొంచెం సేపటికి [illegible]. కను బొమలు చిట్లించారు.

"రమాదేవి నీతో అన్నదా నేను మాట్లాట్టం లేదని. అయినా పెళ్ళి కావలసిన వయసొచ్చిన పిల్ల. ఎవరేమనుకున్నా తరువాత బాధపడి ప్రయోజన మేముంది."

"ఇదివరకు మాట్లాడిన రోజుల్లో ఈ విష యం తట్టనేలేదా బావా."

"తప్పు తెల్సుకోటానికి నాబోటివాడికి కొన్నేళ్లు పడుతుంది సీతా."

"మనస్సునీ, హృదయాన్నీ అర్థం చేసుకోటానికి".

"కొన్ని ఏళ్ళు పట్టొచ్చు."

"సహృదయుల్ని సహృదయతతో అర్థం చేసు కుంటే ఏ అనర్థకాలూ రావు బావా".





ఇప్పుడు, సొగసైన కొత్త రూపులో!

ఎక్కడ
లైఫ్‌బాయ్ వున్నదో
అక్కడ ఆరోగ్యము వున్నది

హాయిగా! ఉల్లాసంగా! ఆరోగ్యంగా! వుంటారు లైఫ్‌బాయ్‌తో స్నానానంతరం. లైఫ్‌బాయ్ మురికిలోగల క్రిములను కడిగివేస్తుంది. మిమ్ములను శుభ్రంగా...హాయిగా...ఆరోగ్యంగా. వుంచుతుంది! అంతేగాక, లైఫ్‌బాయ్ పైగల కొత్త కాగితపు మూత ఎంత సొగసైనది! పట్టుకొనుటకు వాటమైన కొత్త ఆకారం గలది. మీ కోసమే నిర్మించబడింది. లైఫ్‌బాయ్ సబ్బునే నేడే కొనండి!

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

L. 47-140 TU

అంటే

"మీ జీవిత దృక్పథం ఒకవైపే చూపిస్తున్నది కాని, రెండోవైపు చూపట్లేదు. మీ చుట్టూ ఉండే మనుష్యుల హృదయాల్ని మీరు అర్థం చేసుకుంటే మీ జీవిత సోపానంలో మీరు ఒక మెట్టు పైకి ఎక్కినట్లే."

"అందరి మనసుల్లా, అందరి జీవితాలూ అర్థం చేసుకోవాలనే నిబంధన ఏమీ లేదు."

"ఎందుకు లేదు బావా, అందరి దాకా ఎందుకు నా మనస్సుని మీరు అర్థంచేసుకున్నారా?"

"ఇప్పుడిప్పుడే అర్థమవుతున్నది."

"కాదుగదా. నేను మీతో మాట్లాడుతున్నాను. కనుక నా హృదయం మీకు అర్థమౌతున్నది. నా మాదిరి మాట్లాడలేని మూగజీవాల హృదయాలు ఎట్లా అర్థంచేసుకుంటారు. ఎట్లా అర్థమౌతుంది.'

"ముందే చెప్పానుగా, అందరి హృదయాలూ అర్థంచేసుకోవాలనే నియమం లేదని. అసలు నా ఉద్దేశ్యం కూడా అదికాదు"

"అట్లా అనకు బావా. అర్థం చేసుకోవడానికి ప్రయత్నించండి. రాసంటటడే అర్థమవుతుంది. సరే, నేను ఈ రోజునే వెళతాను. ఉత్తరాలు రాస్తూ ఉంటారుగా. త్వరలోనే మళ్ళీ వస్తాను. మళ్ళీవచ్చే అవకాశం నాకు తప్పక లభిస్తుంది" అన్నాను. అర్థం కాక నావైపు చూశాడు బావ. బాబుని ముద్దు పెట్టుకుని మేడమెట్లు దిగబోతూ ఉన్నాను. నాలుగు మెట్ల అవతల ఎంతసేపటినుంచి ఉన్నాదో రమాదేవి. నన్ను చూడగానే కళ్ళొత్తుకుంటూ వెళ్ళి పోయింది.

ఇంట్లోకి వెళ్ళిచూశాను. రమాదేవి కనపడలేదు. ఇంటికి వెళ్ళిపోయింది. రమాదేవితో చెప్పకుండా వెళ్ళిపోవటమా! నాకు మనస్కరించ లేదు.

గడియారం చూశాను. రైలుకు యింకా గంటన్నర టైముంది. గబాగబా నాలుగు మెతుకులు తిని అందరిదగ్గరా సెలవు తీసుకుని రిక్షాఎక్కి రమాదేవి యింటికి వెళ్ళాను. నేరుగా మేడమీద గదిలోకి వెళ్ళాను. మంచంమీద గోడవైపుకు తిరిగి పడుకున్నది రమాదేవి. నా అలికిడి విని లేచి కూర్చుంది. కళ్ళు ఎర్ర బడ్డయ్. కన్నీటి చారికలు చెంపలమీద స్పష్టంగా కనిపిస్తున్నయ్. నేనూ మంచంమీదనే కూర్చున్నాను. "నాతో చెప్పకుండా వచ్చేశావేం రమా, కోపమొచ్చిందా. అంతసేపు బావతో మాట్లాడుతూ కూర్చున్నానని"

"నాకేం కోపము సీతా. నీమనస్సును ఈ రోజు పూర్తిగా అర్థంచేసుకున్నాను. నువ్విట్లా మనస్సు మార్చుకోవటానికి కారణం నేనని యిప్పుడు తెలుసు కున్నాను. మీబావ నిన్ను ప్రేమిస్తున్నారని నాకు తెలుసు. వార్ని భర్తగా స్వీకరిస్తావనే ఇంతవరకూ అనుకున్నాను. ఉత్తరంలో నువ్వు అవిధంగా రాసినా నమ్మలేదు. ఇప్పుడు ప్రత్యక్షంగా మీమాటలు విన్నాను. నీకు నేనెంత ద్రోహం చేస్తున్నానో నాకిప్పుడు తెలిసింది. నన్ను క్షమించు సీతా. ఈరోజునుంచి ఎప్పుడూ మీబావ గారింటికి వెళ్ళను. బాబుని ఎత్తుకోను. ఏమిటో వాడ్ని చూస్తుంటే మనస్సు ఉండబట్టక యింతవరకూ వెళ్ళాను. మీ బంధుత్వానికి, మీబావగారి కోరికలకి నేను అడ్డుగా ఉన్నాననే ఊహ నాకు తట్టలేదు. క్షమించు సీతా" అంటూ కంట తడిపెట్టి నాచేతులు పట్టుకుంది రమాదేవి.

"ఏమిటి రమా ఇది. ఏడాది పెద్దదానివి, చదువుకున్న దానివి. అభిరుచిగల నువ్వేయింత అగాధానపడుతుంటే యింకనే ఆశ్చర్యమువుంది. ఎందుకీ విచారం. ఎందుకింత ఆందోళన. కాస్త నిదానంగా ఆలోచించు. నేను వెళుతున్నాను. ఒక్కమాట. ఏదో అనుకున్నా అత్మహత్య చేసుకోవద్దు. నీమనస్సుతో నీవు ఘర్షణ పడితే యింకా చెప్పేదే ఉంది. మనమేం సినిమా మనుష్యులు కావు. రెండు ప్రతిరూపాలుగా, ఇద్దరు రమా దేవులుగా కనబడి తర్కవితర్కాలు చేసుకోవడానికి. నీమనస్సుకు నీవే ఆలోచించుకో. నీవు ఎవర్నీవంచించటం లేదు. నిన్ను నీవు వంచనచేసుకోవద్దు. ఉత్తరాలు మాత్రం రాస్తుండు. మరెళతాను బండికి టైమయింది" అంటూ రమాదేవి కన్నీళ్ళు తుడిచి "చూడు రమా నీవు బావగారింటికి వెళ్ళటం మానకు. బాబు దిగులుపడతాడు. నామాట విని, కనీసం వాడికోసమయినా వెళ్ళు. నా మాటకాదనకు" అన్నాను.

రమాదేవి మాట్లాడ లేదు.

"రమా! ఎప్పటి మాదిరే వెళ్ళకపోతే నామీద ఒట్టే" అన్నాను. రమాదేవి వెళతానంది. ఎంతో సంతోషంతో నేను రైలెక్కాను.

* * *

పది రోజులుపోయాక సుభద్ర ఉత్తరం రాసింది.

సీతా,

నీవు కులాసాగా వున్నావని తలుస్తాను. నేను శ్రీమతినయినా, మీఅన్నగారి ప్రేమ, అభిమానాలు చూరగొంటున్నా, వారితో సుఖ సంతోషాలతో మునిగి తేలుతున్నా, సర్వవేళలా నిన్ను తల్చుకుంటూనే వుంటాను. నీమాటలూ నీచేతలూ, నీఊహలూ మరపురాని మణి పూసలు. అన్నయ్య అన్ని విషయాలూ చెప్పారు. నీ అంత వివేకవంతురాలూ, ఉన్నతభావాలు కలవారూ స్త్రీజాతిలో చాలా అరుదు. మన కుటుంబాల్లో అందరిలో మణి పూసలాంటి దానివి. త్యాగమూర్తివి.

రమాదేవితో నీవు వచ్చివెళ్ళిం తరువాత చాలా మార్పు కనబడింది. ఆమార్పు నీవల్ల వచ్చిందే. ఇప్పుడ



[illegible]
లేనట్టే పోయి ఆడుకుంటున్నది. వాడూ రమాదేవికి అతిసన్నిహితుడై పోయాడు. ఇదంతా అమ్మచూసి మొన్నొకసారి అన్నది. రమాదేవిని చూస్తుంటే జానకిని చూసినట్లుగా ఉంటున్నదని అన్నది. మాయింట్లో ఒకర్తెగా ఉంటున్నది రమాదేవి. కాని అన్నయ్యలో ఆశించ దగిన మార్పు రాలేదు. అన్నయ్య కఠినాత్ముడు కాదు. కాని ఎదుటివారి హృదయాల్ని అర్థం చేసుకో లేడు. హృదయౌన్నత్యంగల ఆడది రమాదేవి. కాని అన్నయ్య రమాదేవి హృదయాన్ని అర్థంచేసుకోలేక పోతున్నాడు. ఈ పరీక్షలో ఎవరు నెగ్గుతారో ? అంతా నీమీద ఆధారపడి ఉన్నది. ప్రస్తుతం అన్నయ్య పరిస్థితి యెట్లావున్నదంటే నువ్వు విషమిచ్చినా అమృతంగా భావించేటట్లుగా ఉన్నాడు. కాని ఏమో భావాలు మనస్సులో ఉన్నా అవి నువ్వే వెలికి తియ్యాలి. ఆ సమర్థత నీలోనే ఉన్నది. నేనొకసారి రమాదేవిని అడిగాను. "అన్నయ్య నిన్ను పలకరించటం లేదనుకో. అన్నయ్యతో నువ్వే కలిపించుకుని ఎందుకు మాట్లాడ కూడదు" అన్నాను.

రమాదేవి ఏమన్నదో తెలుసా సీతా, "మీ అన్నయ్య మనస్సు నాకు తెలుసు. మామనస్సును వారు తెలుసు కుంటే మాటలు వాటంతట వ్వే కలుస్తాయ్య" అన్నది.

ఈ మాటల అర్థం ఏమిటో ఆలోచించు సీతా.

మొన్నవో విశేషం జరిగింది. మామూలుగానే వచ్చి రమాదేవి బాబుని ఎత్తుకుంది. ఉన్నట్లుండి ఆవెధవ రమాదేవి చీరపాడుచేశాడు. రమాదేవి విసుక్కుంటుం దేమోననుకున్నాను. నేనే ఆపరిస్థితుల్లో ఉంటే వాడిని ఎత్తి ఉయ్యాల్లో పడేసి విసుక్కుంటూ బట్టలు మార్చుకునేదాన్ని. రమాదేవి ఏమీ అనలేదు. నవ్వుతూ నన్నుపిల్చి "సు శీ ల పభ ద్రా, మీ మేనల్లుడు ఎంత కొంటెపని చేశాడో" అంటూ నాదగ్గరికి వెళ్ళి అంతా కడిగేసింది. రమాదేవికి ఎంత ఓర్పో ఆలోచించు సీతా. బాబుకి చేసే సేవచూస్తుంటే నా కు కళ్ళల్లో నీళ్ళు తిరిగినయ్యి. మరి బి. కాం. చదువుతున్నది, ఎప్పుడు కాలేజీ పుస్తకాలు, నోట్సు చదువుతుందో నాకు తెలీదు. అన్నయ్యను సాహసించి అడిగాను. రమాదేవిని పెళ్ళిచేసుకోరాదా అని. అన్నయ్య నవ్వి ఊరుకున్నాడు. పిరికితనంగానైనా వాళ్ళిద్దరూ మాట్లాడుకోలేరు.

సీతా! నాపరిస్థితి ఆలోచించు. మీకన్నా నేను చిన్నదాన్నే కాదా. అప్పుడే ప్రేమించి పెండ్లి చేసుకో వటం వరకూ వచ్చింది. ఒక్కొక్కరి జీవితాలు ఎట్లా మారిపోతాయో ఎవ్వరికీ తెలీదు.

అమ్మనీ నాన్ననీ కూడా అడిగాను. అన్నయ్యకు రమాదేవిని చేసుకోమని. వాళ్ళకీ ఇష్టమే రమాదేవి తమకోడలుకావటానికి. కాని అన్నయ్య ఒప్పుకుంటేగా, ఈ సమస్య తేలటానికి.

నాకో నేను అనుకుంటాను. రెండో పెళ్ళివాడని అన్నయ్యను నువ్వు కాదన్నా, రమాదేవి అన్నయ్యనే ఎందుకు చేసుకోవాలను కుంటున్నదా అని.

ఏమయినా ఈసమస్యలను నువ్వే తెల్చి, వాళ్ళని ఒక దారికి తీసుకురావాలి.

ఇంకా మార్చి పరీక్షలు నెలరోజులున్నాయి కదా! పరీక్షలకు నువ్వు బాగా చదువుతున్నావనుకుంటాను.

[illegible]
నువ్వు గుంటూరు వస్తున్నట్టుగా సీతా! జాబు రాయాలి సుమా! సుభద్ర.

ఉత్తరమంతా చదివితే సంతోషంగానే ఉంది. కాని ఒక్కమాట నాహృదయాన్ని కలిచి వేసింది. బావరెండో పెళ్ళివాడని నేను చేసుకోవడానికి యిష్టపడలేదని సుభద్ర అనుకుంటున్నది. ఆ ఉద్దేశ్యం నే నెప్పుడూ వెలిబుచ్చలేదే ? సుభద్ర ఎందుకట్లా అనుమానప డాలి ? బావ రెండో పెళ్ళివాడని నే నెప్పుడూ అనలేదే ? నా కసలు ఆలాంటి భావనే లేదే ? సుభద్ర ఎందుకిట్లా అనుకోవాలి ? ఈ విష యంలో ఇంక పరీక్ష లయ్యేవరకూ జోక్యం కలిగించుకో దలుచుకోలేదు. అందుకని వెంటనే జాబు రాయలేదు.

పరీక్షలు దగ్గర పట్టం నుంచి నా దృష్టినంతా చదువుమీదనే కేంద్రీకరించాను.

పబ్లిక్ పరీక్షలయినవి. కాలేజి గొడవ ఇంకా తీరి పోయింది. పరీక్షల్లో బాగానే రాశాను. తప్పక ప్యాసవు తాననే నమ్మకం ఉంది. పరీక్షలవంగానే ఏదో పెద్ద బరువు దించినట్లయింది. పుస్తకాలన్నీ అవ తల పారేసి రెండు మూడు రోజులు విశ్రాంతి తీసు కున్నాను.

నాన్నగారు గాని, అమ్మగాని నా పెళ్ళి విషయమే ప్రస్తావించటంలేదు.

నాన్నగారు అడిగారు "పి. యు. సి. ప్యాసయిన తరువాత ఏంచెయ్యదలుచుకున్నావమ్మా" అని.

"ఫలితాలు తెలిసేండి నాన్నా. తరువాత ఆలో చించవచ్చునుగా" అన్నాను.

"అది సరేనమ్మా. డిగ్రీకోర్సు చదువుతావా. చదువు ఆపేస్తావా. అసలు నీ మనస్సులో ఉన్నది చెప్పమ్మా సీతా" అన్నారు నాన్న.

అమ్మ ఏం మాట్లాడలేదు. అమ్మ మనస్సు నాకూ, నాన్నకు తెల్సిందే. నవ్వి అయ్య చేతుల్లో

[illegible]
ఉద్దేశ్యం.

నేనింకా కాలేజీ చదువు చదవటం అమ్మకు ఏమాత్రం ఇష్టంలేదు.

నాన్న మళ్ళా అడగటం మంచి నా ఉద్దేశ్యం చెప్పాను.

"నాన్నా! నేను మంచి మార్కులతో ప్యాసవుతా ననే నమ్మకం ఉంది. దైవకృపవల్ల నేను క్లాసులో ప్యాసయితే డాక్టరు కోర్సు చదవాలని ఉన్నది నాన్నా" అన్నాను.

"డాక్టరు కోర్సా!"

"అవును నాన్నా."

"కలగంటున్నావా సీతా!"

"కల కాదు నాన్నా. నిజమే."

"ఎట్లా సాధ్యం తల్లీ. నా స్థితిగతులు నీకూ తెల్సు కదా సీతా. ఎట్లా చదువుతావమ్మా అయిదేళ్ళు. ఏం చూసి ఆ ఉద్దేశ్యం వెలిబుచ్చావమ్మా."

నాన్న జాలిగా అడిగారు. ఆయన కళ్ళల్లో నీళ్ళు తిరిగినయ్యి.

"విచారించకండి నాన్నా. నాకా యోగ్యత ఉంటే చదువు సాగుతుంది. ఆ గీత లేకపోతే ఏమీ లేదు. నేను డిగ్రీ కోర్సే చదువుతాను. దానికేంగాని, నాన్నా నే నొకసారి గుంటూరు వెళ్ళి రావాలి. వెళ్ళి నాలుగు రోజుల్లో వస్తాను నాన్నా."

"మళ్ళీ గుంటూరెందుకు తల్లీ. బావతో ఏమైనా మాట్లాడాలా."

"వెళ్ళొచ్చాక చెపుతాగా నాన్నా."

"సరేనమ్మా" నాన్న ఒప్పుకున్నారు. అయిష్టంగానే అమ్మ కూడా ఒప్పుకుంది.

మర్నాడే నేను గుంటూరు ప్రయాణ మయ్యాను. ఈసారి గుంటూరు ప్రయాణమంటే ఎందుకో నా మనస్సు పరవళ్ళు తొక్కింది. ఎందుకో, ఏమో? అప్పట్లో నాకు అర్థంకాలేదు. (సశేషం)



గున్నమామిడి చిగురు
కొసరి తినె కాబోలు,
పికము నీవలె శ్రవణ
పేయ గానము సేయ.
ఫలభోజనము విధిగ
పాటించె కాబోలు,
శుకము నీవలె మధుర
సూక్తులననేర్చె.
వృక్షాల బెకలించి
వ్యాయామ మొనరించె
కాబోలు, కరి నీదు
గమనగతి నేర్చెంగ.
నీ నృత్యభంగిమల
విలిచి కనె కాబోలు.
బర్హి నీవలె కనుల
పండువగు నటు లాడ.

నీ నయన సౌందర్య
మనుకరింపగ నెంచె
కాబోలు, సోయంక
కనుల కాటుక దిద్దె.
పుత్తడి నీ రంగు
పులుముకొన కాబోలు,
ధరణిలో నంతంత
ధరలు పలుకగ జొచ్చె.
చంచలమౌ కనుల
జంటకనె కాబోలు,
మత్స్యమ్ము నీటిలో
మసలి యాడుట నేర్చె.
ఇన్ని యాకర్షణలు కల్గి
యున్ననే కాబోలు,
ధరణి యంతయు నీకు
దాసోహ మనుట.

— వేల్పుచర్ల సుబ్బారావు




## పీచు

11 వ పేజీ తరువాయి

ఆ నాస్తికుడు కల గంటున్నాడు, పీచు బుర్రలతో యమదూతలు తనని లాగుతున్నట్టు ! మీ పీచమడచేదనని తాను వాదిస్తున్నట్టు !! ఆ సమయంలో బీరకాయపీచు బంధువులు, నారు ఊపించి యుండేమిటి ? అని అడిగారు. కలలో యమదూతల పీచమడిచే నాస్తికుడు కళ్లుతెరిచి, ''పీచు పట్టుకొచ్చే రేవిటర్రా!'' అని, కళ్లుమూశాడు.

బలవంతంగా అనిపించాలంటే యిలాగే ఉంటుంది. కొన్నాళ్లవరకు పాశ్చాత్యులు ప్రాగ్దేశస్తులచే ఆంగ్లం మాటాడించేరు. ఇప్పుడు కొత్త దొరలు దాక్షిణాత్యులచే డిటో !! నేర్చుకోకపోతే, ఉద్యోగులకి యింక్రిమెంట్లు రావు, విద్యార్థులు ఉత్తీర్ణులు కారు !

ఆంగ్లేయులు ''గాడ్ ది గుడ్ ! కాంకర్ పీస్'' (God The Good, Conquer Peace) అనమంటే, అచ్చుతెనుగులో గాడిది గుడ్డూ, కంకర పీచూ అన్నాడో ఆంధ్రుడు.

పీచు అంటే హిందీలో అర్థం తెలియకపోయినా, దాన్ని తిరగేసి ''చుపీ'' అంటే ''మౌనముగా'' అన్న అర్థం వస్తుంది. అనుమానం ఉంటే

''తూ చుపీ హై కహాఁ?
మై తడపూ యహాఁ !'' అన్న పాట వినండి.

'పీ' అంటే త్రాగు అని అర్థం.

ఇంకేం వ్రాసేది ?

''ఏ పీచు చరిత్ర చూసినా
ఏమున్నది గర్వకారణం ?
పీచులతో తాళ్లు పేనడం
వారలతో సంచు అల్లడం !'' తప్ప—

## ఇంటింటి పజ్యాలు

ఆరుద్ర

### నావుడు కరారావుడు

వ్యాపారం చేసే ప్రతి సంస్థా అందుకో
అని తగిలించుకుంటుంది బోర్డెందుకో
కొందరు చేసేది ఎగుమతి కొందరు చేసేది దిగుమతి
అందరికీ యివ్వాలి ప్రభుత్వం అనుమతి
సరిపోతుందా ఎవరికైనా ఒక్క సర్కారు సమ్మతి
చక్కగా ఐ. పీ. పెడితే డబ్బు దాచడానికి కావాలో శ్రీమతి.

## సరాగమాల

భద్రాచలం నుంచి పాపినేని సీతాదేవి ''ఐశ్వర్యంగల కులీన కుటుంబంలో, లేమి పిచత్వమూ తెలియని చోట, సద్వర్తనులైన తలిదండ్రుల పెంపకంలో, ఉన్నతాత్ములగు అధ్యాపకుల శిక్షణలో దయాంతరంగులగు మిత్రుల సాంగత్యంలో పెరిగిన వ్యక్తికే ఉత్తమ సంస్కారం అలవడుతుందని'' శ్రీ సామర్‌సెట్‌మామ్ అన్నారు.

అటువంటి వారు.

మీరు పైందన ధర్మసూత్రాలకు ముఖ్యమైన ప్రాతిపదిక పూర్వజన్మ సుకృతాన్ని మరచినట్లున్నారు. అది లేనిదే పైన మీరుదహరించిన వన్నీ సమకూడవు. సమకూడినా ఉత్తమ సంస్కారముగా ఘనీభవించవు. మామ్ అన్న మాటలో నిజముండక పోదు. కాని అందులో పదవవంతుకైనా ఆ వ్యక్తి అర్హుడైతే ధన్యుడే. ఇక నేనానాడన్నమాట, ఇంటి యింటికి తీసుకునివెళ్లి అమ్మటానికి పంపేహించనని, ఇంకా పూర్తిగా నిజమవలేదుకాని ఒకటి మాత్రం నిజం. నేను మూడుమూర్లు వెక్కిరిస్తూ బిచ్చగాళ్ల పాటలా ఉందని విమర్శిస్తూ, తెగనాడిన ''పెళ్లినాటమంచి'' అమ్ముడుపోయిన కాపీలలో సగంకూడా అమ్ముడుపోలేదు నేను పదివమార్లు పొగడి వ్రాసిన ''నీలాల నింగి తేలి''. రెండు రికార్డులకూ కారకులు పి. బి. శ్రీనివాస్, ఎస్. జానకి, రాజశ్రీ. శ్రీరామ్. ఈ ఎగుడు దిగుడులకు పూర్తిగా బాధ్యులు శబ్దాన్ని అనుసరించికొనే పెళ్లి సంగీతకారులు, ఆంప్లిఫైయరుధారులు.

* * *

ఇద్దరు వ్యక్తులు కలసి సంగీతాన్ని ఇవ్వటం హిందీ చిత్రాలలో అనాదిగా ఉన్న ఆచారం. హుసన్లాల్— భగత్రామ్, శంకర్— జైకిషన్, బిపిన్—బాబుల్, వేద్—మదన్, కల్యాణ్ జీ—ఆనంద్‌జీ, లక్ష్మీకాంత్ —ప్యారేలాల్ ఇలా ఉన్నారు హిందీ చిత్రసీమలో. తెలుగులో ఇటువంటి జంటలు చాలా అరుదు. ఆ జంటలు చేసిన చిత్రాలూ అరుదే. ప్రసాదరావు— కేల్కర్, చలపతిరావు—మోహన్ దాస్, రాజేశ్వరరావు—హనుమంతరావు, వేలూరి—జోసెఫ్, ఈ జంటలు చేసిన చిత్రాలు ఉంటే ఒకటి లేకపోతే రెండు. పై కలయికలన్నిటినీ మరపించే కలయిక ఒకటి ఈ మధ్యనే తటస్థపడింది. ఆ జంట ఎస్.రాజేశ్వరరావు—టి. చలపతిరావు. మొదట్లో రాజేశ్వరరావు మూడు పాటలూ, మిగిలినవి చలపతిరావు చేస్తారనుకున్నారు. కాని పాటలు తయారయేటప్పుడు ఇద్దరు దగ్గరే ఉండటం ఒకరు చేసిన వరసకు ఒకరు మెళకువలు చెప్పటం, ఒకరు దిద్దిన సగిషీలకు మరొకరు మెరుగులు పెట్టటం జరిగింది. పాట రికార్డయిన తరువాత వింటే ఎవరేది చేశారో తెలుసుకోలేక తికమక పడ్డారట. అందుకోసమే అన్ని పాటలకూ ఇద్దరి పేర్లు వేస్తున్నారు. ఈ కలయికలోనుంచి ప్రభవించినవే ఈ రెండు పాటలు.

మంచి మనిషి జి.ఇ. 35471.

కిలకిలలాడే గిటారులూ. కళకళలాడే అకార్డి

యమునకూ, సుశీల ఘంటసాల యుగళగీతం అదిరి పలకరిస్తాయి. ''రాదనుకున్నావేమో'' అని మొదలై ''చక్కని కన్నెవు ముక్కున కోపం నీకేలా'' అని నాయకుడు ప్రశ్నిస్తే నాయకి యుగా లుగా స్త్రీలు అడుగుతున్న ప్రశ్ననే ''వలచి వచ్చినే చులకనైతిగా ఈ వేళా'' అని మార్చి అంటుంది. శ్రీశ్రీ సాహిత్యం ముత్యాల ప్రోవైతే జంట దర్శకుల సంగీతం చక్కని సంగతుల రేవు. సుశీల కంఠం మందారమాలంటుతే ఘంటసాలది మలయమారుత ఖేల. వాద్యగోష్ఠి అమానియామినీ లీల. ప్రేమికులకీ పాటొక మన్మధ డోల.

రెండవ ప్రక్కనకూడా ప్రేమ గీతమే. మొదటిది ఉత్తమ నాయకీ నాయకులదైతే రెండవది విదూషకుల జంటది. వరసలో జానపదుల జాను తనం, మాటలో కొసరాజు జాణతనం, పాడటంలో జానకి మెత్తదనం, మాధవపెద్ది కొంటెతనం పాటకంతటికీ ఒక కొత్తదనం చేకూరుస్తున్నాయి. పాపం ''గుబులు గుబులుగా గుండె దిగులుగా'' అనేకి ఉంటే అతనికి ఎలా ఉంటుంది.? తెలుసుకోవాలంటే వెండితెరదాకా వెళ్ళనక్కర్లేదు. ఆ చిత్రం విడుదలయేవరకు రికార్డు వింటేచాలు.

* * *

దాగుడుమూతలు ఎన్. 69816.

సర్వసాధారణంగా ఒక చిత్రంలో అన్నిటికీ తీసికట్టుగా ఉన్న పాటను తీస్తే అది కామెడీ గీతమయే ప్రారబ్ధం తెలుగు చిత్రాలలో ఉండేది. ఇటీవల ఆ తలవంపు తప్పుతున్నది. ఈ కోవకు చెందిన వాటిలో ''డివ్వి డివ్వి డివ్విట్టం'' ఒకటి. ఎక్కడా అశ్లీలార్థం వెతకి చూద్దామన్నాలేదు. ''ఛీ డిక్కంది అదృష్టం గొట్టికెక్కంది మన కష్టం'' అని అమ్మాయంటే ''డివ్వి డివ్వి డివ్విట్టం నువ్వంటేనా నా కిష్టం'' అని అబ్బాయి అంటాడు. అమ్మాయి ఎవరు ? ''అంచెలంచెలు,'' ''కోడలా కోడలా'', ''పిట్టను పడుచున్నదోయి'' స్వర్ణలత. అయితే అబ్బాయి ? ''ఈ వేళ నువ్వం వ్రాసుకున్నా ప్రేమపత్రమూ'', ''శాంతవంటి పిల్ల లేదోయి'' పిఠాపురం. పాట వింటుంటే బుక్క వసంతాల చల్లుకున్నట్టు, ఎంచక్కా తలంబ్రాలు పోసుకున్నట్టు ఉంటుంది. దీనికి కారణం ఊగించే మహాదేవన్ వరుస. ఆరుద్ర రచన. హుషారుకి మారు పేరుగా ఉన్నది వీరిద్దరి సృష్టి.

''గోరంక గూటికే'' నాకేమీ నచ్చలేదంటే చాలామంది పాఠకులు నాపై కోపగిస్తారని కుంటాను. ఎందుకోగాని ఈ రెండు పాటల్లో నాకు ఏమాత్రం ఆకర్షణా కనపడలేదు. వరసలో కొత్తదనం కొంచమే. అదీ రెండుమార్లు వెంట వెంటనే వినినంతనే మాయమవుతుంది. ఈ రికార్డులో ఉన్నది ఘంటసాల పాడినది. ఈ కారుమబ్బుకి ఒకే ఒక బంగారు అంచు. దాశరథి రచనలో కొన్ని తళుకులు.

''మా మత్తెస్వరాలు నీకు మంచి కథలు చెప్పెనే''
''విలవిలలాడి కళ్ళు నిదురపోతున్నాయి
పైటచెంగు రెపరెపలు పటాడ తోస్తున్నాయి''

అనుడు వ్రాసి చూస్తుంటే ఈ మెరుపులు ధాలసిపిస్తున్నది.



మంచిమనిషిలో జమున.

వివాహబంధం ఎన్. 69804

''వివాహబంధం'' ఉన్నవి ముచ్చటగా మూడే పాటలు. వాటిలోనిది ''నగుమోము''నే త్యాగరాజ కీర్తన ఇవన్నీ వారాని కొకటి పరిచయం చేస్తాను. ఈవారం కానుక :

''విన్నావా
మనసులోన దాగివున్న మధుర గీతి
తొలిచూపులు నా మదిలో తలుపుతెరిచెనే
పెదవులపై చిరునవ్వులు విరులు కురిసెనే
తలపులన్ని వేణువులై పిలుపులాగెనే
హృదయమే యమునా నదియై కదలిపోగెనే
అందరాని చందమామ ముందు నిలిచెనే
అణువణువునే వెన్నెలలే అలబోసెనే
వలపులు విరజాజులుగా పరిమళించెనే
జగమే బృందావనియై పొంగిపొరలెనే''

రచన సి.నారాయణరెడ్డి. ఇంత చక్కగా ఉన్నందుకేకాదు పాటంతా ఉదహరించినది. ఆనాటి జయదేవ నారాయణతీర్థులనుంచి ఈనాటి సి. నారాయణరెడ్డివరకూ శృంగారములో అందాన్ని చూపించాలంటే ఆనందాన్ని గుప్పించాలంటే రాధామాధవలీలా వర్ణనలే శరణ్యం. వేణువులు, యమునానది, వెన్నెల, విరజాజుల్లు, బృందావనం — పాటకీ అందం ఆనంద భావాని స్పర్శవలనే కదా !

పై పాటను మధురముగా, లలితముగా పాడినది భానుమతి. ఆ కంఠంలో అనురాగం, ప్రతీక్ష, అహంకారం, అనునయం, ప్రణయం మిళితమైనట్టు మరింకే స్వరంలోనూ కానరాదు. ఓ మారు ఆ పాటను వినండి. నా మాటను కాదనగలరేమో చూడండి.

రెండవ ప్రక్క పాట సాధారణమైనది. ''కోవెల తలుపులు మూసినంతనే దైవము దూరమైపోవునా'' అన్న ప్రశ్న ఆ పాటకు సాహిత్య సీమలో ప్రవేశం కలిగించింది. వరుస కూడా పెద్దగా చెప్పుకోదగినదేమీకాదు. పై రెండు పాటలూ సి. నారాయణరెడ్డి రచన. ఎం.బి.శ్రీనివాస్ సంగీతం. భానుమతి సంగీత పర్యవేక్షణ.

* * *

''చిటారు కొమ్మన మిఠాయి పొట్లం
చేతికందేం గురుడా
పాటంజూసి వడుపుజూసి
పంచర కొమ్మను విరుడా''

కన్యాశుల్కం— మల్లాది—— ఘంటసాల ఘంటసాల.!

వి. ఎ. కె. రంగారావు ★



'జహానార'లో మాలాసిన్హా, భరత్ భూషణ్.

చిత్ర సమీక్ష

# చక్కని ప్రేమగాథ 'జహానార'

ప్రియుణ్ణి కలవబోనని, తండ్రికి అయిష్టమైన పనిని చేయనని ఒక్కొక్క అవసానదశలో ఇచ్చిన మాట ఒకవైపు ఆమెను క్రుంగదీస్తున్నా, ప్రాణేశ్వరుణ్ణి కలవాలని, భావగీతిక చెప్పుకోవాలని ఆమె హృదయం మరోవైపు విశృంఖలంగా పరవళ్ళు త్రొక్కుతుంది. అనుకోకుండా దూరమయిన ప్రియురాలిని చూచి, అతనూ తల్లడిల్లిపోతూ ఉంటాడు.

'జహన్ ఆరా' షాజహాను చక్రవర్తి కూతురు. బాల్య స్నేహితుడు, కవి—గాయకుడు అయిన మీర్జాను చూచి మది పులకించి, మోహంలో పడుతుంది. తండ్రి ఏమీ చెప్పకపోయినా, ఈ ఇరువురి ప్రేమకు అతను సుముఖుడు కాడు. 'ప్రేమించే హక్కు ప్రభువులకేగాని, పేదవానికి లేదా' అన్న మీర్జా ప్రశ్న విన్న షాజహాను అపార మస్తకం వణకి, చివరకు అతనికి మరణదండన విధిస్తాడు. కొన్ని వారాలు, నెలలు గడుస్తుండగా మీర్జా 'మరణదండన' కార్యరూపం ధరించేలోగా, షాజహాన్ పెద్ద కొడుకైన ఔరంగజేబు దండయాత్ర చేయించి, రాజ్యాన్ని చేజిక్కించు కొంటాడు. ప్రియుని ఆలాపన ఒకవైపు ఘోష పెడుతున్నా, 'జహన్ ఆరా' మాత్రం రాజ్యభ్రష్టుడైన తండ్రిని సంరక్షిస్తూ, ఏడు సంవత్సరాల పాటు జీవితాన్ని గడిపి, చివరకు ప్రియునికి ఒక్కమారు తన ముఖాన్ని చూపి చనిపోతుంది.

చరిత్రాత్మకమైన ఈ కథ షాజహాను, ముంతాజ్‌ల ప్రేమ గాథంతటి సుప్రసిద్ధమైనది కాకపోయినా, మహమ్మదీయ చరిత్రలో ముఖ్యమైనదే. చరిత్రను పెద్ద మార్పులు లేకుండా తెరమీదకు ఎక్కించటం ఇందలి విశేషం.

''లైట్ అండ్ షేడ్'' వారు నిర్మించిన ఈ చిత్రం 'ఈస్ట్‌మన్ కలర్'లో తయారైంది. చక్కని రంగులతోడు ప్రతిభావంతమైన ఛాయాగ్రహణం కూడా ప్రేక్షకులను ఆకర్షిస్తుంది.

పేరుకు ప్రేమగాథే అయినా, ఇందులో నాయికా నాయకులు చాలావరకు విరహబాధే అనుభవిస్తారు. 'డ్యూయెట్ల'కంటె 'సోలో' పాటలే ఎక్కువ. పైగా హిందీ చిత్రంలో ఉర్దూ పదజాలాన్ని మిక్కుటంగా ఉపయోగించటంతో నిర్మాతలు ఆశించిన మహమ్మదీయ వాతావరణం ఉట్టిపడినా, సహజత్వం లోపించింది. చిన్న కథను తీసికొని సుదీర్ఘంగా తయారు చేయటంచేత అక్కడక్కడ విసుగుపుట్టే అవకాశం ఉంది.

'జహన్ ఆరా'గా మాలాసిన్హా చక్కగా నటించింది. విరహిణిగా ఆమె చూపిన నటన కన్నీ తరమైనదే. ప్రియుడు మీర్జాగా నటించిన భరత్ భూషణ్ రసికునిగాకంటె, ఆశయం ఫలించని కవి, గాయకుడుగా బావున్నాడు. ప్రేమ సన్నివేశాలలో కథా నాయకుడు అసమర్థుడుగా కనిపిస్తాడు.

విలువైన సెట్టింగులు తప్పకుండా కన్నుల పండువుగా ఉన్నాయి. ఔట్‌డోర్ దృశ్యాల చిత్రీకరణ బావుంది. సంగీతం కొన్నిచోట్ల పేలవంగా ఉన్నా, మరికొన్నిచోట్ల అనన్య సామాన్యంగా ఉంది. పాటలన్నింటిలో ఉర్దూ పదాలు, సంగీతం ఎక్కువ ఉండటం ఆధునికంగా లేకపోయినా, కొంతవరకు ఇవి ప్రాచీన సంగీతప్రియులకు నచ్చక పోవు. దర్శకత్వం రమ్యంగానే ఉంది.

చిత్రం చూశాక, ప్రేక్షకుడు బరువెక్కిన హృదయంతో ఇంటికి వెళ్తాడు.

ఆంధ్రలో శ్రీరామా పిక్చర్స్ వారు విడుదల చేస్తున్న ఈ చిత్రాన్ని యిటీవలనే మద్రాసులోని 'ఆనంద్' థియేటరులో పత్రికా విలేఖరులకు ప్రత్యేకంగా చూపారు. వాశిరాజు ప్రకాశం. ★

## సినిమా వార్తలు

### 'ప్రేమించిచూడు'

మెజస్టిక్ స్టూడియో కొద్దికాలంనుంచి మూసి వేయబడి ఉన్నది. ఇటీవల మళ్ళీ తెరిచారు. ఇప్పుడు ఏ. యల్. శ్రీనివాసన్‌గారి ఆధిపత్యంలోకి వచ్చి క్రొత్త రూపు సంతరించుకుంటున్నది. నవంబరు 9 నుంచి పద్మశ్రీవారి క్రొత్త చిత్రం ''ప్రేమించి చూడు'' పాటల రికార్డింగ్ కార్యక్రమం ఆరంభమైనది మెజస్టిక్‌లో.

ఈ చిత్రంలో నాగేశ్వరరావు, జగ్గయ్య, రేలంగి, చలం, రాజశ్రీ, కాంచన మొదలైనవారు పాల్గొంటారు. అవుట్‌డోర్ షూటింగ్‌తో ఈ చిత్ర నిర్మాణం ప్రారంభమవుతుంది. అందుకు తగిన సన్నాహాలు చేసుకుంటున్నారు. సంభాషణలు : ముళ్ళపూడి వెంకటరమణ, పాటలు ఇప్పటివరకూ ఆత్రేయ, సి. నారాయణరెడ్డి, ఆరుద్ర, ముళ్ళపూడి వెంకటరమణ వ్రాశారు. సంగీతం : వేణు. నృత్యాలు : తంగప్పన్, కెమెరా : పి. యల్. రాయ్, దర్శకుడు : సి. పుల్లయ్య, బి. ఏ., నిర్మాత : వి. వెంకటేశ్వర్లు బి. ఏ. ఈ చిత్రాన్ని సంపూర్ణ హాస్య రసభరితంగా రూపొందించాలని దర్శక నిర్మాతల సంకల్పం.

### వాసంతి ముందంజ

నటి వాసంతికి చదువుతోపాటు చక్కని అభిరుచి కూడ ఉంది. తీరిక వేళల్లో తెలుగు, ఆంగ్ల సాహిత్యాలు చదువుతూ కూచుంటుంది. సెట్ మీద నటించబోయే సన్నివేశానికి ముందుగా ఇంటివద్ద రిహార్సల్ చేసుకుంటుంది. ఇటీవల విడుదలయిన ''వివాహబంధం'' చిత్రంలో అరుణగా నటించి ముందటి చిత్రాలకన్న మెప్పించుకున్నది.

తనకు ఇచ్చిన పాత్రను నాలుగైదుసార్లు పరిశీ

లించి రచయిత దృక్పథం, సన్నివేశానికి గల ప్రాధాన్యత తెలుసుకుంటుంది. చదువుకున్నందు వల్ల ఆమెలో ఈ ప్రత్యేక దృష్టి అలవడింది.

వాసంతి చందూభాయ్ పటేల్ హిందీలో నిర్మించుతున్న ఈస్ట్‌మన్ కలర్ చిత్రం "కృష్ణ లీల" లో రాధగా నటించేందుకు ఈమధ్య ఒప్పందం జరిగింది. హిందీ చిత్రాల్లో నటించడం ఆమెకు యిదే ప్రథమం. సావిత్రి, జమున, సరోజాదేవి దక్షిణాది చిత్రాల్లో నటనలో అపూర్వమైన ప్రతిభ కనబరచి యిదివరకే హిందీ చిత్రరంగంలో ప్రవేశించారు. ఇప్పుడు వాసంతి కూడ ఉత్తరాది వారి దృష్టిని ఆకర్షించడం ముదావహం.

## పల్నాటి వీరకథ

శ్రీ ఉషారమావారి "పల్నాటి వీరకథ" చిత్ర నిర్మాణం త్వరితగతిని సాగుతున్నది. ఎన్. టి. రామారావు, కాంతారావు, హరనాథ్, బాలయ్య, గుమ్మడి, ముక్కామల, రాజనాల, మిక్కిలినేని, ప్రభాకరరెడ్డి, కె. వి. యస్. శర్మ, త్యాగరాజు, భానుమతి, జమున, వాసంతి, ఎల్. విజయలక్ష్మి నటిస్తున్నారు. స్క్రీన్‌ప్లే, సంభాషణలు : సదాశివ బ్రహ్మం, పాటలు : మల్లాది రామకృష్ణశాస్త్రి, సముద్రాల (సీనియర్) ఆరుద్ర, సంగీతం : ఎస్. రాజేశ్వరరావు, కళ : శోభనే, నృత్యాలు : వెంపటి సత్యం, కెమెరా : సి. నాగేశ్వరరావు, దర్శకుడు : జి. రామినీడు, నిర్మాతలు : టి. హనుమంతరావు, డి. సూర్యనారాయణ, వై. లక్ష్మయ్య చౌదరి. భానుమతి పాడిన "జయశంభో శివశంకర" అనే పాటను రికార్డు చేసి, ఆమెపై చిత్రీకరించారు. మరికొన్ని పాటలు ఈ మాసంలో రికార్డు చేస్తారు.

## నాగేశ్వరరావు కొత్త చిత్రాలు

నాగేశ్వరరావు నటించేందుకు అంగీకరించిన చిత్రాలసంఖ్య ఈ సంవత్సరం ఎక్కువగానే కనిపిస్తున్నది. వాటిలో జగపతి పిక్చర్స్‌వారి "అంతస్తులు" చిత్రం అక్టోబరు చివరి వారం నుంచి షూటింగు ప్రారంభించారు. ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ చిత్రం, పద్మశ్రీవారి "ప్రేమించి చూడు" చిత్రాల షూటింగులు డిసెంబరులో మొదలవుతాయి. మిగిలినవి జనవరి నుంచి ప్రారంభమవుతవి.

## సురేష్ ప్రొడక్షన్స్

సురేష్ ప్రొడక్షన్స్‌వారు "శ్రీకృష్ణ తులాభారం" చిత్రం నిర్మించబోతున్నారు. ఎన్. టి. రామారావు—కృష్ణుడు, ఎస్. వి. రంగారావు—ఇంద్రుడు, కాంతారావు—నారదుడు, రుక్మిణి—అంజలీదేవి, సత్యభామ—జమున, రంభగా ఎల్. విజయలక్ష్మి ఇంతవరకు ఎన్నుకోబడినారు. మిగిలిన వారిని కూడా ఎన్నికచేసి త్వరలో సెట్స్‌పైకి వెళతారు. ప్రస్తుతం పాటల రికార్డింగ్ జరుగుతున్నది. రచన : సముద్రాల (సీనియర్) సంగీతం : పెండ్యాల, దర్శకత్వం : తాపీ చాణక్య, నిర్మాత : డి. రామానాయుడు.

—మోహన్‌కుమార్ ★



'సుమంగళి'లో జి. వరలక్ష్మి, నాగేశ్వరరావు.



'పాండవ వనవాసం'లో రామారావు, రాజసులోచన.

# దగ్గును పోగొట్టుకొండి

# దగ్గు

త్వరితముగా, నిరపాయముగా, నిశ్చయముగా దగ్గు పోవుటకు

# గ్లైకోడిన్

## టెర్ప్ వసాకా

గ్లైకోడిన్ ఉత్తమమైన దగ్గునివారిణి అనుటకు




6 కారణములు:

1. వివిధ రకముల దగ్గులకు నిశ్చయముగా పనిచేస్తుంది.
2. మంచి ఔషధములు చేరినది, డాక్టర్ల నమ్మకిని పొందినది.
3. చిన్నా పెద్దా అందరికీ నచ్చే రుచిగలది.
4. సిఫార్సు చేసిన మోతాదు ఏ చెడునూ కలిగించదు.
5. 4 పొదుపైన సైజులలో లభిస్తోంది.
6. నమ్మకమైన అలెంబిక్ కంపెనీ తయారు.




**30 ఏళ్లకు పైగా దగ్గుకు యింటి మందుగా వాడబడుతోంది**

STV1242 TEL EVEREST



## అలిపిరిలో తిరుపతి కొండ ఎక్కే ముందు లాల్‌బహదూర్.

7 వ పేజీ తరువాయి

యుంపజేయడానికి కాంగ్రెసు కార్యకర్తలు కృషి చేయాలని ఒక సూచన ఉంది. దీనిని ఒక కాంగ్రెసు రైతు నాయకుడు ఉదాహరిస్తూ, "అసలు కాంగ్రెసు నామదేయులందరూ త్వరగా ధాన్యం అమ్మితే—ఆహారసమస్యే ఉండదు. వారు కోరేటంత హెచ్చు ధర మరెవ్వరూ కోరరు. ఆ సంగతి అందరికీ తెలిసిందే" అన్నాడు. ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ పి. తిమ్మారెడ్డిగారు అయినా రైతుల తరఫున మాట్లాడతాడని చాలామంది ఆశించారు. "ఇది వివాదాస్పదమైనది. నేను మాట్లాడనబ్బా" అని ఆయన అన్నారు. "దీనిని వ్యతిరేకిస్తే నేనే వ్యతిరేకించాలి. కాని, నేను ఒక అబ్జర్వర్‌గా మాత్రమే సభలో పాల్గొనదలచాను" అని ఒక రైతుపెద్ద అన్నారు. ఆహారసమస్య వంటి ప్రధానాంశంపై కాంగ్రెసుపెద్దల ఆలోచన—ఆచరణ ఇలా ఉన్నప్పుడు, అధికార తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదించినా, ఆచరణలో దాని ఫలితం శూన్యమనక తప్పదు. దానిలో వివరించిన విధానాలు ప్రజామోదాన్ని పొందవని వేరుగా చెప్ప నవసరంలేదు.

### మహా ఆడంబరం !

నిరాడంబరంగా జరగవలసిన ఏ. ఐ. సి. సి. సభలను మహా ఆడంబరంగా జరిపించారు. వేల టన్నుల బరువుగల ఇనుపరేకులను, ఉక్కు దూలాలను, అల్యూమినం పంపులను సభా మంటపం నిర్మాణానికి వీధులలో జండా స్తంభాలకు వినియోగించారు. తాటి ఆకులు, వెదురు వాసాలతో ఇంతకంటె అందంగా సభా మంటపాన్ని నిర్మించవచ్చునని, అందువల్ల కొన్ని వేల మందికి పని లభించేదని, సభ అనంతరం వాటిని మాచర్ల పట్టణంలోని వరదపీడితులైన బీదలకు ఇస్తే ఎంతో సహాయం జరిగేదని ఒకరు కాదు అందరూ అనుకున్నారు. బస్తీలలో ఒక టెలిఫోన్ పొందాలన్నా, వీధులలో మాడిపోయిన బల్బులు మార్పించాలన్నా, ఇండ్లకు కొత్తగా విద్యుత్‌సప్లయి పొందాలన్నా, నీటికంపులు వేయించుకోవాలన్నా రోజులు—కాదు — నెలలు — సంవత్సరాలు తాత్సారంచేసే ప్రభుత్వ యంత్రం—ప్రభుత్వోద్యోగులు కొన్ని రోజులలో—గంటలలో "నెహ్రూనగర్"ను నిర్మించడం చూస్తే, వివిధశాఖల ఉన్నతాధికారులు, వారి వాహనాలు, మంత్రులు—వారి సిబ్బంది అక్కడ

# ఏ. ఐ. సి. సి. సభ

ఇంత శ్రద్ధ—పట్టుదల ప్రజలకు చేయవలసిన సౌకర్యాల విషయంలో ఎందుకు ఉండదు ? ప్రభుత్వ యంత్రాన్ని ఇంత పటిష్ఠంగా—చురుకుగా ఎందుకు నడిపించరు? అనే అనుమానం కలుగుతుంది. వీరి నీతి నిజాయితీలను శంకింపజేస్తుంది. నిలబడి పనులు జరిపించడం చూస్తే—వీరికి

ఏ. ఐ. సి. సి. సభ జరిగినన్నాళ్లూ — రోజూ గుంటూరు పురవీధులలో నిలబడిన జనసమూహాలలో ఇందుకు సంబంధించిన విమర్శలు— వ్యాఖ్యలు వినవచ్చాయి. ప్రజలదృష్టిలో కాంగ్రెసుపార్టీ నిజ స్వరూపాన్ని నిరూపించాయి.

కేవలం ప్రజల దృష్టిలోనే కాదు. కొందరు కాంగ్రెసువాదుల దృష్టిలో కూడా గుంటూరు ఏ. ఐ. సి. సి. సభలు విమర్శలకు గురి అయినాయి.


**సలహా**

క్షీణించిపోయిన ఆనందం, బలం, శక్తిని తిరిగి యిచ్చేందుకు ఆహ్లాదకరమైనది. నరాల బలంకు పైపూతకు వాడే తైలం. 1 సీసా రు 11-50 స్పెషల్ రకం అర్జంటు గుణంకు రు. 27/- ఎడ్వాన్సు పంపుతూ జవాబుకు కవరు పంపాలి.

డాక్టర్ రత్నం సన్స్,
Sex Specialists (Estd 1904)
ఆజంపురామార్కెట్‌వద్ద, మలకపేట బిల్డింగ్స్
హైదరాబాద్-24 (ఆంధ్రప్రదేశ్)

**తెల్ల వెంట్రుకలను పోగొట్టును**

వెంట్రుకలకు రంగుకాదు. ఆయుర్వేదము ప్రకారము అనేక భారతీయ మూలికలచే తయారుచేయబడిన "శ్యామ్ కాంతి" తెల్ల వెంట్రుకలను శాశ్వతముగ వాటి సాధారణ నలుపురంగునకు మార్చుటతో అసాధారణ శక్తి కలిగియున్నది. వెల: రూ. 10/-

Shyam Ayurved Bhawan.
No. 114.P.O.KatriSarai(Gaya)

కే. టి. కృష్ణమూర్తి ఆచారిగారి



**"మేల్‌మాయిల్ మందు"**

వల్లరంగు, ఎర్రరంగు పొడలు, దద్దులు, గజ్జి, మరియు చెడ్డనీరు వ్యాపించి నందుంచే విర్పడు విసుగు పుట్టించు రణములు మొదలగు

*దీర్ఘకాల చర్మరోగములకు ఉత్తమ నివారిణి*

— వివరములకు —

సిద్ధ డాక్టర్ కే. టి. కృష్ణమూర్తి ఆచారి & సన్సు
5/22, మేల్‌మాయిల్, (P. O.) N. A. Dt.

**GOLDEN BOOKS FOR YOU**

All Books Are Genuine Printed in U.K.&U.S A. Postage free on Rs. 11
One Beautiful New Year Diary Free on orders of Rs. 18/- Concession upto 31st Dec.

| | Rs. P. |
|---|---|
| Perfect your English How to speak and write correctly | 12-00 |
| How to increase your Height Illus 3-5" Increase Guaranteed | 5·00 |
| Complete Body Builder - Exercises for Health Illus | 11·00 |
| Technique of Sex Illustrated 504000 copies sold | 13-00 |
| Encylopedia of Sex & Love Technique Illus 100000 copies sold | 26·00 |
| Married Love New Solution of sex difficulties Illus | 6-50 |
| Radio construction&Repair including Portable Radios, Transistor Illus | 15·00 |
| Automobile Diesel Engines - Servicing, Maintenance, Mechanism of 17 types of Engines 170 Illus | 20 00 |
| Guide to Plastics - What Plastics are and how plastic goods are made Illus | 20 00 |

| | Rs. P. |
|---|---|
| Dynomo & Electric Motor Building — Construction Winding Magnets & Armatures, Testing 164 Illus | 14-70 |
| Gardening in Pictures - Fruits, Flowers, Vegetables 392 Illus | 13·00 |
| Heart-prevention & Cure of Heart Diseases | 11·00 |
| Better Sight without Glasses Self Treatment of defective vision and diseases of Eyes | 11·00 |
| Factory Management&Control-organisation, Control of Production and costs Illus | 11·00 |
| Poultry Breeding&Production-Breeding, Feeding, Management Illus | 12·00 |
| Birth Control & You with charts, Diagrams, Tables, Prescriptions Illus | 9 75 |

BHASIN BOOK DEPOT (A. 10.) 29/1, SHAKTI NAGAR, DELHI-6

సభోపరిలోప ప్రవేశానికి పాస్‌లు ఇవ్వడంలో, టిక్కెట్ల అమ్మకంలో, ప్రత్యేక ఆహ్వానితుల వ్యక్తులు బహిష్కరించడంలో ముఠా రాజకీయాలు, ఆశ్రిత పక్షపాతాలు, చివరకు బ్లాక్‌మార్కెట్ వ్యవహారాలు కూడా కలవని బహిరంగంగా విమర్శించిన కాంగ్రెసు కార్యకర్తలు, జిల్లాల కాంగ్రెసు నాయకులు ఉన్నారు. ఇదంతా "ఒక నాయకుని పలుకుబడిని నిరూపించడానికి, ఆయన అనుచరులు చేసిన హంగామా." అని ఒక రాష్ట్ర నాయకుడు నిర్మొహమాటంగా అన్నాడు. రాష్ట్ర కాంగ్రెసులో దూరంగా కొట్టబడిన వర్గం వారందరి అభిప్రాయాలు ఇలాగే ఉన్నాయి. ఇందుకు ఉదాహరణగా, కేంద్ర మంత్రి, పార్లమెంటులో గుంటూరు పట్టణ ప్రతినిధి శ్రీ కొత్త రఘురామయ్యగారిని ఉదాహరించవచ్చు. ఏ. ఐ. సి. సి.

# ఏ. ఐ. సి. సి. సభ

ఆహ్వానసంఘంలో ఆయనకు ప్రాతినిధ్యమైనా ఇవ్వకపోవడాన్ని నిదర్శనంగా చెప్పవచ్చు.

ఇంత చేసినా గుంటూరు పట్టణంలోని హిందూ కాలేజి, క్రిస్టియన్ కాలేజి, మెడికల్ కాలేజీల నిర్వాహకులు సహకరించి, వారి హాస్టలు భవనాలను ఇచ్చివుండకపోతే ఏ. ఐ. సి. సి. డెలిగేట్లకు తగిన నివాస వసతులు లభించేవి కావు. సుమారు ఏభై మంది వ్యక్తులు, కంపెనీలు సహాయం చేయకపోతే నాయకులకు తగిన బంగళాలు, ప్రయాణేటు సౌకర్యాలు ఉండేవి కావు. ఇలా ఈ వసతులను, ముఖ్యంగా విద్యాసంస్థలను వినియోగించుకొనడం సముచితం కాదని ప్రతిపక్షాల నుంచి విమర్శలు వచ్చాయి. ఈ సంస్థలకు, వ్యక్తులకు అభినందనాలు చెప్పవలసిన అవసరం, ఆహ్వాన సంఘం అధ్యక్షులు శ్రీ పి. తిమ్మారెడ్డిగారికి గుర్తుకు రాకపోవటడం చాలామందికి ఆశ్చర్యం కలిగించింది. అంత్యోక్తుల పేరుతో ఆయన చేసిన "అధిక ప్రసంగం" వేదికమీద ఉన్న అగ్రనాయకులందరికీ అసంతృప్తిని కలిగించింది. అందువల్లనే గుంటూరు ఏ. ఐ. సి. సి. సభలు— సర్వత్రా అసంతృప్తిని పెంచాయని చెప్పవలసి వస్తున్నది.

[ఈ వ్యాసంలోని ఛాయాచిత్రాలు శ్రీ పి. వి. ఎస్ శర్మ తీసినవి] ★

## ఖిలాయ్ ఆంధ్రుల ఉత్సవాలు



ఖిలాయ్‌లోని తెలుగువారి సాంస్కృతిక సంఘమైన 'ఆంధ్ర సాహిత్య సమితి' ఇటీవలనే సప్తమ వార్షికోత్సవాన్ని జరుపుకొన్నది. ఈ సందర్భంలో జరిగిన సభలో కేంద్రమంత్రి శ్రీ నీలంసంజీవరెడ్డి ప్రసంగించారు. శ్రీ సంజీవరెడ్డి తన ఉపన్యాసంలో అక్కడి ఆంధ్రుల కృషిపట్ల హర్షం వెలిబుచ్చారు.

## జవహర్‌లాల్ నెహ్రూకు 'అమెరికా' పుష్పాంజలి

అమెరికన్ సమాచారశాఖవారు ప్రచురించిన "యాజ్ అమెరికా రిమెంబర్స్ జవహర్‌లాల్ నెహ్రూ" (అమెరికా గుర్తుంచుకొనే జవహర్‌లాల్ నెహ్రూ) అనే ఆంగ్ల గ్రంథం మా కార్యాలయం చేరింది. త్రివర్ణ ముఖచిత్రం, లోపలి పేజీలలో మరికొన్ని అందమైన రంగుల ఫొటోలు ఈ సంచికలో ఉన్నాయి. ఇండియాలోను, అమెరికాలోను శ్రీ నెహ్రూ పలువురు అమెరికన్ నాయకులతో కలిసి ఉన్నప్పటి ఫోటోలు మరికొన్ని ఆకర్షణీయమైన ఫోటోలు ఈ పుస్తకంలో అందంగా ముద్రించబడ్డాయి. పలువురు పెద్దలు వివిధ సందర్భాలలో వెల్లడించిన సూక్తులను ఈ సంచికలో ప్రస్తావించటం సందర్భోచితంగా ఉంది. నెహ్రూ జన్మదినోత్సవ సందర్భంలో ఈ సంవత్సరం వెలువడిన రెండు మూడు మంచి పుస్తకాలలో ఇదీ ఒకటని విస్పందేహంగా చెప్పవచ్చును ★


ఉచితము ! ఉచితము !!

## తెల్లమచ్చలు

మా ప్రఖ్యాతివహించిన 'డాగ్‌సాఫా' ప్రత్యేక ఔషధము తెల్లమచ్చలను సులభముగ పోగొట్టుటలో 1925 సం|| నుండి ప్రఖ్యాతి వహించియున్నది. మూడురోజులు వాడినంతనే మచ్చల తెలుపుదనం అటుపైన కొన్ని రోజుల్లోనే పూర్తిగా బాగుచేయు శక్తిగలదు. ఉచితంగ ఒక పాకెట్‌మందుఇవ్వబడును నకలునుచూచి మోసపోకండి. **Ashoka Treatment Centre, P. O. Katri Sarai (Gaya)**



## నేషనల్ ట్రాన్సిస్టర్ రు. 72/-

జపాన్‌లోతయారైన పాకెట్ రేడియో, పెద్ద రేడియో వలె పని చేయును. అన్ని ట్రాన్‌సిస్టర్లు, లౌడ్ స్పీకర్లు గ్యారంటీగా జపానులోతయారైనవి.



మీరు కోరినచోట సంగీతం, వార్తలు వినవచ్చు. స్థానికంగా ప్రపంచంలోని ప్రతిస్టేషను వినవచ్చు. వినుటకు సిద్ధంగా పంపబడును టార్చి సెల్‌తో పనిచేయును చవకైనది అందమైనది. తేలికైనది. 3 సం|| గ్యారంటీ. ధర రు. 72/–VPP చార్జీలు రు. 6/–రేడియో తోలుకేసు రు. 7/–

M/s Ceylon Radios (ASW-72)
P. Box 1257, Delhi-6.



పరిమళ



## బ్రాహ్మీ హేర్ ఆయిల్

సున్నితముగా పరిమళం చేయబడిన ఈ ఆయుర్వేద హేర్ ఆయిల్ మెదడును చల్లపరచి, ఉపశమన గలిగించును. క్రమముగా బ్రాహ్మీ హేర్ ఆయిల్ వాడకం మెదడుకు కలుగు అలసటను తొలగించి, హాయిగా నిద్రపట్టించును. ఆరోగ్యమైన కురులు పెరుగుటకు తోడ్పడును.





బెంగాల్ కెమికల్
కలకత్తా
బొంబాయి
కాన్పూరు



Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra-Patrika Press; 6&7 Thambuchetty Street Madras-1. Phone: 29766 & 23713. Chief Editor S. Sambhu Prasad.



విక్టోరియా మెమోరియల్ హాల్, కలకత్తా.




ప్రఖ్యాత నేపథ్యగాయకుడు
పి. బి. శ్రీనివాస్

ఉత్తమ శ్రేణి సౌందర్య సాధనాలు

రెమి

అలంకరణ సామగ్రి

CRITERION. RP. 453